# ఒక్కడే ఇద్దరు





రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





# ఒక్కడే ఇద్దరు


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (70) దశ సప్త గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-38 ప్రథమ ముద్రణ : ఏప్రిల్-2016

ప్రతులు : 1000 **వెల : 90 /-**

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## ఇందూ జ్ఞానవేదిక మరియు ఇతర సంఘముల ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ–దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!–నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
**71) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**72) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**74) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
75) లు అంటే ఏమిటి? (తెలుగు)
76) ఆదిత్య.
77) చెట్టుముందా! విత్తుముందా?
78) ఒక్కడే ఇద్దరు.

### ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్‌ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు–అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా–జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా–అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు–నక్షత్రము.

### సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము–మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు–సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

### ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

### రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.

## 04 యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

*DVD'S*

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ఒక్కడే ఇద్దరు

ప్రపంచములో అతిపెద్ద ప్రశ్న, జవాబు లేని ప్రశ్న ఒక్కటే ఒక్కటి గలదు. **దేవుడెవరు?** అనునదే పెద్ద ప్రశ్న మరియు ప్రపంచములో జవాబు లేని ప్రశ్న. ప్రపంచములో ఏ ప్రశ్నకయినా జవాబు చెప్పవచ్చును గానీ, దేవుడెవరు? అను ప్రశ్నకు జవాబు చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! దేవున్ని తెలిసినవాడు భూమిమీద ఎవడూ లేడు. భూమిమీద బ్రతికినవాడు, అనగా శరీరముతో సజీవముగా యున్నవాడు ఎవడుగానీ దేవున్ని చూచి యుండలేదు, సంపూర్ణముగా తెలిసియుండలేదు.

**ప్రశ్న :- మధ్యలో ప్రశ్న అడుగుచున్నందుకు క్షమించండి. నేటి కాలములో చాలామంది క్రైస్తవుల బోధకులు "మేము దేవున్ని చూచాము, దేవునితో మాట్లాడినాము" అని అంటున్నారు. కొందరు హిందువులలో కూడా అట్లే చెప్పుచున్నవారు కలరు. రామకృష్ణ పరమహంస అనబడు వివేకానందగారి గురువుగారు "నేను దేవున్ని చూచాను, నీకు కూడా చూపిస్తాను" అని స్వయముగా వివేకానందునితోనే చెప్పినట్లు గలదు. మీరేమో "భూమిమీద బ్రతికినవాడు ఎవడూ చూడలేదు" అని అంటున్నారు. మేము మధ్యలో ఎవరి మాటను వినాలి? ఎవరి మాట సత్యమో మీరే చెప్పండి.**

**జవాబు :-** ఎవరికి వారు మా మాట సత్యమని చెప్పుచుందురు. అయితే వినేవారే విచక్షణతో ఆలోచించి, శాస్త్రముతో పోల్చుకుని, హేతుబద్ధముగా ప్రతిమాటకు జవాబు దొరికినప్పుడు దానినే నమ్మవలసియుండును. అంతేగానీ చెప్పేవాడు గొప్పవాడనో, చెప్పేవాడు సత్యవంతుడనో నమ్మి విశ్వసించితే అది మూఢనమ్మకమగును. అది విచక్షణ లేని నమ్మకమగును. అందువలన వినేవాడు ప్రతి దానిని హేతుబద్ధముగా ఆలోచించవలసి

యుండును. దేవుని ధర్మములని చెప్పబడు వాటిలో **"దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడు"** అనుమాట చాలా ముఖ్యమైనది. దేవునికి రూపము లేదు అట్లే దేవుడు కనిపించువాడు కూడా కాదు. అటువంటప్పుడు దేవున్ని నేను చూచాను అని ఎవడయినా అంటే అది శుద్ధ అసత్యమని చెప్పవచ్చును. **'దేవుడు'** అను పదములోనే **'దేవులాడబడేవాడు (వెతకబడేవాడు)'** అని అర్థము గలదు. ఈ మాట ప్రకారము దేవుడు మనిషి చేత ఎప్పటికీ వెతకబడేవాడే గానీ తెలియబడేవాడు కాడనీ, దొరికేవాడు కాడనీ తెలియు చున్నది. అందువలన భూమిమీద సూక్ష్మశరీరముతో గానీ, స్థూలశరీరముతో యున్నవాడు ఎవడుగానీ దేవున్ని చూడలేదని చెప్పుచున్నాము.

దేవుడు ఈ ప్రపంచమును సృష్టించకముందు దేవుడని కూడా చెప్పబడేవాడు కాదు. దేవున్ని దేవుడని చెప్పే దానికి మరియొక మనిషంటూ లేడు. దేవుని స్థితి ఏమిటో! ఎట్లుండెడివాడో! ప్రపంచము పుట్టిన తర్వాత కూడా ఎవరికీ తెలియదు. దేవుడు సృష్టించిన సృష్టిలోని మనుషులకు దేవుడు ఎవరో, ఆయన శక్తి ఏమిటో తెలియుటకు దేవున్ని గురించిన సమాచారము అవసరము. దేవున్ని గురించిన సమాచారమునే 'దేవుని జ్ఞానము' అని అంటున్నాము. దేవుని జ్ఞానము ఇదియని తెలియుటకు దేవుని సమాచారము కొద్దిగా తెలిసినవాడు ఎవడూ లేడు. అందువలన దేవుని జ్ఞానము ఏమిటో? భూమిమీద పుట్టిన ఏ మనిషికీ తెలియదు. అటువంటప్పుడు దేవుని జ్ఞానమును దేవుడే చెప్పాలిగానీ మరి ఇతర మానవుడు ఎవడూ చెప్పలేడు. అందువలన అంతిమ దైవగ్రంథములో చెప్పబడిన ఒక వాక్యము ఇలా కలదు చూడండి. సూరా 3 ఆయత్ 7 **(3-7) "ఆయన (అల్లాహ్) యే నీపై ఈ గ్రంథమును (ఖురాన్‌ను)**

**అవతరింపజేశాడు. ఇందులో కొన్ని స్పష్టమైన అర్థమిచ్చే (ముహ్కమాత్) ఆయత్‌లు ఉన్నాయి. అవి ఈ గ్రంథానికి మూలాలు. మరికొన్ని అస్పష్టమైన (ముతషాబిహాత్) ఆయత్‌లు ఉన్నాయి. అయితే తమ హృదయాలలో వక్రతయున్నవారు సంక్షోభమును రేకెత్తించడానికి, గూఢార్థములను కల్పించి ఎల్లప్పుడు అస్పష్టమైన వాటి వెంటపడతారు. వాటి అసలు అర్థము అల్లాహ్‌కు తప్ప (దేవునికి తప్ప) ఇతరులెవ్వరికీ తెలియదు. కానీ పరిపక్వ జ్ఞానము కలవారు "మేము దీనిని విశ్వసించాము ప్రతి ఒక్కటీ మా ప్రభువు వద్దనుంచి వచ్చినదే!" అని అంటారు. శ్రద్ధ, జ్ఞానము యున్నవారు తప్ప ఇతరులు వీటిని గ్రహించలేరు.**

ఈ వాక్యమును బట్టి దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులెవరికీ తెలియదని అర్థమగుచున్నది. దేవుని జ్ఞానము తెలియాలంటే దేవుడు చెప్పిన గ్రంథములోనే చూడవలసియుండును. 'దేవుడు స్వయముగా ఏ పని చేయడు' అని చెప్పినా, దేవుడు చేయకుండా తన ప్రకృతి చేత అన్ని కార్యములను చేయిస్తున్నాడు. దేవుడు తన జ్ఞానమును సృష్ట్యాదిలోనే ప్రకృతిలో ఒక భాగమయిన ఆకాశమునుండి చెప్పించాడు. ప్రకృతిలో ఆకాశ భూతము అను ఒక భాగము చేత దేవుని జ్ఞానము మొట్టమొదట చెప్పబడినది. మొదట చెప్పినది ఆకాశమయినా, పైకి అందరికీ తెలిసినది ఆకాశ భూతమైనా, ఆకాశ భూతములో అణిగి ఎవరికీ తెలియకుండా యున్న ఆత్మయే జ్ఞానమును చెప్పినదని చెప్పుచున్నాము. అణిగియున్న ఆత్మ చెప్పినదని ఎవరికీ తెలియదు, అందువలన మొదట ఆకాశము తన వాణిచేత (శబ్దము చేత) దేవుని జ్ఞానమును చెప్పినదని అర్థమయినది.

**ప్రశ్న :- దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడైనందున ఇతరులకు కనిపించడు, ఫలానా వాడను పేరు లేకపోవచ్చును. అయితే క్రియ అయిన కార్యములను చేయకపోయినా ఫరవాలేదు. తన జ్ఞానమును తానే స్వయముగా చెప్పవచ్చును కదా! ఆకాశము ద్వారా చెప్పించినా, ఇతరులకు తెలియదను తన మాట వ్యర్థమైపోవును. ఆకాశమునకు దేవుని జ్ఞానము తెలిసినట్లు ఇతరులకు అర్థమగును కదా! దానివలన దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు తెలియదను మాట అసత్యముగా కనిపించును కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దేవుని మాట ఎప్పటికీ అసత్యము కాదుగానీ, మనము దేవుని మాటను అర్థము చేసుకోవడములో పొరపాటు పడియుండవచ్చును. ఇటువంటి ప్రశ్నలు రాబోతాయని దేవుడు ముందే అంతిమముగ చెప్పిన బోధలో ఇలా చెప్పాడు. సూరా 42 ఆయత్ 51 **(42-51) "దేవ్వుడు ఏ మానవ్వునితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. దేవ్వునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పనికాదు. దేవ్వుడు తన జ్ఞానమును వాణి ద్వారా లేక తెరవెనుకనుండి మనిషికి చేరవేస్తాడు లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని పంప్పుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు".** ఈ మాటలను గ్రహించితే దేవుడు తన జ్ఞానమును మూడు విధములుగా భూమిమీద గల మనుషులకు తెలియ జేయునని తెలియుచున్నది. దేవుడు చెప్పిన మూడు విధానములు దేవుడు నిర్ణయించినవే అయినందున, దేవుడు ఏ విధానములో జ్ఞానము చెప్పినా అది దేవుడు చెప్పినట్లేయగును. ఒక విధముగా దేవుడు తాను స్వయముగా పని చేయకున్నా, తన సంకల్పము చేత ఇతరుల ద్వారా పని చేయించి ప్రజలకు తన జ్ఞానమును తెలియజేయుచున్నాడు. దేవుని జ్ఞానము దేవునికి

తప్ప ఇతర మనుషులకు ఎవరికీ తెలియదని చెప్పాడు. అంతేగానీ తనలో భాగముగాయున్న ఆత్మకు లేక తన ప్రతినిధిగాయున్న భగవంతునికి తెలియదని చెప్పలేదు కదా!

ఆకాశ శబ్దము ద్వారా చెప్పినప్పుడుగానీ, తెరవెనుకనుండి చెప్పినప్పుడుగానీ, తన ప్రతినిధి చెప్పినప్పుడుగానీ తెలియజేసిన జ్ఞానము దేవుని ఆత్మ తెలియజేసినదే అగుట వలన స్వయముగా తానే (దేవుడే) జ్ఞానమును తెలిపినట్లు అగుచున్నది. దేవుడు తననుండి రెండు ఆత్మలను బయటికి తీశాడు. అందులో ఒకటి జీవాత్మకాగా రెండవది ఆత్మగా యున్నది. ఈ రెండు ఆత్మలనే భగవద్గీతయందు ఒకడు నాశనమయ్యే వాడు, మరియొకడు నాశనము కానివాడని చెప్పాడు. వారినే గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగము అను అధ్యాయములో క్షరుడు, అక్షరుడని చెప్పారు. జీవున్ని నాశనమగు వాడని **'క్షరుడు'** అని అన్నారు. దేవుని జ్ఞానము చెప్పుటకు దేవుని ప్రతినిధిగా **అక్షరుడయిన** ఆత్మయే పనిచేయుచున్నది. అక్షరుడైన ఆత్మ ఇటు జీవాత్మ పనిని, అటు దేవుని పనిని రెండిటినీ చేయుచున్నది. అందువలన దేవుడు, జీవుడు పని చేయకున్ననూ పని చేసిన వారిగానే లెక్కించబడుచున్నారు. ముఖ్యముగా ఆత్మ దేవుని పనిని చేసి దేవుని జ్ఞానమును మూడు విధముల ప్రపంచములో తెలియజేయుచున్ననూ, ఆత్మ అణిగియుండుట వలన ఆత్మను ఎవరూ గుర్తించలేకపోవుచున్నారు. మొదట ఆకాశములో అణిగియున్న ఆత్మయే పరమాత్మయొక్క జ్ఞానమును చెప్పినా చివరకు ఆకాశము చెప్పినట్లే అందరూ గ్రహించారు. ఎవరికీ తెలియని ఆత్మను తెలియనట్లు ఉంచుటకు దేవుడు కూడా ఆకాశవాణి ద్వారా జ్ఞానమును తెలియజేశానని చెప్పాడు తప్ప తన ఆత్మ చెప్పినదని చెప్పలేదు.

**ప్రశ్న :- ఆత్మ దేవుని ప్రతినిధి అని అన్నారు కదా! దేవునికి, ఆత్మకు ఏమి భేదము కలదు?**

**జవాబు :-** పరమాత్మ ఖాళీ బోర్డులాంటిది. ఆత్మ ఖాళీ బోర్డులో గీయబడిన గోళీ బొమ్మలాంటిది. ఖాళీ బోర్డును శూన్యముగా పోల్చవచ్చును. అందులోని (బోర్డులోని) గోళీ బొమ్మను ఆత్మగా పోల్చవచ్చును. ఖాళీబోర్డుకు ఆకారము లేదు. ఖాళీ బోర్డులో యున్న గోళీ బొమ్మకు ఆకారమున్నది. అందువలన పరమాత్మ అయిన దేవునికి ఆకారము లేదు, ఆత్మకు ఆకారమున్నదని చెప్పవచ్చును. పరమాత్మకు ఆత్మ ప్రతినిధిగాయుండి దేవుని పనులను ఆత్మయే చేయుచున్నది. పరమాత్మను ఖాళీ బోర్డుగా చెప్పితే, ఆత్మను బోర్డులో గోళీ బొమ్మగా పోల్చి చెప్పవచ్చును. పరమాత్మ ప్రపంచమంతటా జీవమున్న, జీవములేని వాటియందు వ్యాపించియుండగా, ఆత్మ జీవమున్న శరీరములలో జీవాత్మకు తోడుగా యున్నది. జీవములేని పదార్థములలో ఆత్మ లేదు. పరమాత్మ జీవమున్న, జీవములేని వాటియందు అణువణువునా వ్యాపించియుండగా, ఆత్మ కేవలము జీవమున్న వాటియందు మాత్రమే కలదు. ఆత్మకు ఆకారముండగా పరమాత్మకు ఆకారము లేదు. దేవుడయిన పరమాత్మ పని చేయడు. పరమాత్మ పనిని చేయుటకే ఆత్మ బ్రతికిన శరీరములలో జీవునితోపాటు ఉంటున్నది. శరీరములోయుంటున్న ఆత్మ జీవునితో కర్మను అనుభవింపజేస్తూ అవసరమొచ్చినప్పుడు దైవ ఆజ్ఞను నెరవేర్చుచున్నది.

సృష్ట్యాదిలో మొట్టమొదట ఆకాశము దైవజ్ఞానమును చెప్పినప్పుడు ఆకాశము అను భూతము (జీవుడు) నుండి దైవజ్ఞానమును ఆత్మయే చెప్పినది. పరమాత్మనుండి విడివడివచ్చినది ఆత్మ కావున పరమాత్మ

జ్ఞానమంతయూ ఆత్మకు తెలియును. సముద్రములో ఉన్నదంతా నీరే అయినా సముద్రము నుండి ఎగిరివచ్చిన నీటి బిందువులో కూడా నీరే యున్నది. నీటిలోయున్న తేమ నీటి బిందువులో కూడా యుండుట వలన పరమాత్మలోని జ్ఞానము ఆత్మలో కూడా యున్నది. అందువలన దేవుని జ్ఞానము దేవునికే కాకుండా దేవుని జ్ఞానము ఆత్మకు కూడా తెలియును. అందువలన దేవుని జ్ఞానమును దేవుడు చెప్పకున్నా దేవుని జ్ఞానమును ఆత్మయే చెప్పుచున్నది. దేవుడు పనిచేసి తన జ్ఞానమును మనుషులకు చెప్పకున్నా దేవుని స్థానములో ఆత్మ పనిచేసి దేవుని జ్ఞానమును మనుషులకు తెల్పుచున్నది. ఈ విధముగా ఆత్మ దేవుని కార్యమును చేయుచుండుట వలన దేవుని పని దేవుడు చేయకున్నా దేవుడు చేసినట్లే జరిగిపోవుచున్నది. అందువలన దేవుడు అనుకుంటే అనుకున్నది అనుకున్నట్లు అయిపోవును. దేవుడు మూడు విధముల తన జ్ఞానమును మనుషులతో తాను ప్రత్యక్షముగా మాట్లాడకుండా తెలుపుదునని చెప్పినది ఈ పద్ధతి ప్రకారమేయని తెలియవలెను.

దేవుడు మనుషులతో ప్రత్యక్షముగా సంబంధమును పెట్టుకోక ఆత్మద్వారా పరోక్ష సంబంధము కల్గియున్నాడు. అదే పద్ధతిలోనే మనుషులకు మూడు విధముల జ్ఞానమును తెలియజేశాడు. తెరచాటునుండి జ్ఞానమును చెప్పినప్పుడుగానీ, తన ప్రతినిధిని ప్రత్యక్షముగా పంపి జ్ఞానమును చెప్పినప్పుడు గానీ ఎవరికీ తెలియకుండా ఆత్మయే ముఖ్యపాత్ర పోషించి ఆ కార్యములను చేయగలిగినది. ఈ విషయము నేడు అందరికీ క్రొత్తగా కనిపించినా గతములో జరిగిన సత్యము అదియే. ఇప్పుడు జరుగుచున్నది కూడా అదియే. ఆత్మ లేనిది ఏ శరీరములో కూడా ఏమీ జరుగదు. ప్రథమ దైవ గ్రంథమునుండి చివరిదైన అంతిమ దైవగ్రంథము వరకు

చెప్పబడిన జ్ఞానములో ఈ విషయము స్పష్టముగా తెలియుచున్నది. దేవునికి తెలియకుండా ఏదీ జరుగలేదు. అయినా దేవుడు ఏదీ చేయలేదు.

**ప్రశ్న :- మీరు ప్రథమ దైవగ్రంథము, మధ్యమ (ద్వితీయ) దైవగ్రంథము, అంతిమ దైవగ్రంథమని మూడు పేర్లు చెప్పుచున్నారు. మీరు తప్ప లోకములో ఎవరూ ఇంతవరకు ఈ మూడు పేర్లు చెప్పలేదు. 'అంతిమ దైవగ్రంథము ఖురాన్' అని చాలామంది ముస్లీమ్ పెద్దలు చెప్పుచున్నారు. అంతేకాక జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి ఖురాన్ జ్ఞానాన్ని చెప్పినప్పుడే ఖురాన్‌ను అంతిమ దైవగ్రంథమని చెప్పడము జరిగినది. దీనిప్రకారము ఖురాన్ గ్రంథమును అంతిమ దైవగ్రంథమని చెప్పుటకు ఆధారమున్నది. అయితే మీరు చెప్పుచున్నట్లు ప్రథమ దైవగ్రంథము భగవద్గీతయనీ, ద్వితీయ దైవగ్రంథము ఇంజీలు (బైబిలు) అని ఇంతవరకు ఏ గ్రంథములో ఎవరూ చెప్పలేదు. ఎవరూ చెప్పని దానిని మీరు చెప్పడములో మీ ఉద్దేశ్యమేమి?**

**జవాబు :-** ఎవరూ చెప్పని విషయమునే నేను బోధ రూపములో చెప్పుచూ వచ్చాను. అట్లే ఎవరూ వ్రాయని జ్ఞానమునే నేను గ్రంథ రూపములో వ్రాయుచూ వచ్చాను. ఇంతవరకు 144 ఉపన్యాసములను చెప్పాను, అట్లే 75 గ్రంథముల వరకు వ్రాశాను. ఎక్కడయినా ఇతరులు చెప్పిన దానిని నేను ప్రవచనాలలో చెప్పానా? అలాగే ఏ గ్రంథములో అయినా ఇతరులు వ్రాసిన దానిని వ్రాశానా? ఇంతవరకూ తెలియని విషయమును తెలుపుటయే నా పనిగా పెట్టుకున్నాను. ఇంతవరకు ఎవరికీ తెలియని విషయమును తెలుపుటే నా కర్తవ్యము అయినందున దైవగ్రంథములు ఎన్ని? అవి ఏవి? అను విషయమును మీకు తెలుపుటయే నా ఉద్దేశ్యమయి నది. ఆ ప్రయత్నములోనే మిగతా రెండు దైవగ్రంథములను మీకు తెలియ

జేయడమైనది. ఇంతవరకు మీకు తెలిసినది అంతిమ దైవగ్రంథము ఖురాన్ అన్న విషయము ఒక్కటి మాత్రమే. ఖురాన్ అంతిమ దైవగ్రంథము అనుమాటను నేను కూడా ఒప్పుకొంటున్నాను. అయితే ఖురాన్‌ను అంతిమ దైవగ్రంథమని ఏ లెక్కప్రకారము అంటున్నారని ప్రశ్నించి చూచాను. అందరి వద్ద దానికి ఇంతవరకు పొంతనలేని సమాధానము మాత్రమే దొరికినది. శాస్త్రబద్ధమైన, ఖచ్చితమైన, ఎవరూ ఖండించలేని విధముగా జవాబు దొరకలేదు.

ఖురాన్ గ్రంథమును అంతిమ దైవగ్రంథమని గ్రుడ్డిగా ఒప్పుకుంటే దానివెనుక ఎన్నో ప్రశ్నలు రాగలవు. అందువలన దానిని ఒక లెక్కప్రకారము, తగిన విధానము ప్రకారము అంతిమ దైవగ్రంథమని చెప్పగలిగినప్పుడు ఎవరికీ దానిని గురించి ప్రశ్నరాకపోవును. ఖురాన్‌ను అంతిమ దైవగ్రంథమని మనుషులు పేరుపెట్టలేదు. దేవుడే ఆ పేరును పెట్టడము వలన అది వాస్తవముగా అంతిమ దైవగ్రంథమనుటకు ఏ సంశయము లేదు. అంతిమ దైవగ్రంథమని చెప్పినా కొందరు వారిలోనున్న అనుమానము కొద్దీ ప్రశ్నలను అడుగుచుందురు. ఆ ప్రశ్నలు ఇలా ఉన్నవి. **1) ఖురాన్ అంతిమ దైవ గ్రంథమయితే దానికంటే ముందు ఎన్ని గ్రంథములు గలవు? 2) ఆఖరీ దైవగ్రంథమంటే దైవగ్రంథములలో తక్కువ జ్ఞానమున్నదని అనుకోవచ్చునా? 3) దైవగ్రంథములు ఎన్నియున్నా వాటన్నిటికంటే చివరిదైనందున చివరి దానికంటే ముందున్నవే వరుసలో గొప్పవని అర్థము కదా!** అని లేనిపోని ప్రశ్నలను అడుగవచ్చును. అయితే అంతిమ దైవగ్రంథమని దేవుడే చెప్పి యుండుట వలన దానికి ఒక హద్దు పద్దు ప్రకారము జవాబును చెప్పవచ్చును. అంతిమ దైవగ్రంథముకంటే ముందు ఎన్ని గ్రంథములు ఉన్నాయి? మొత్తము దైవగ్రంథములు ఎన్ని? చివరి దైవగ్రంథములోని

జ్ఞానము యొక్క స్థాయి ఎంత? అను ప్రశ్నలన్నిటికీ ఖురాన్ గ్రంథములోనే 42వ సూరా, 51వ ఆయత్‌నందు సంపూర్ణమైన జవాబు గలదు.

42వ సూరా, 51వ ఆయత్‌నందు దేవుడు తన జ్ఞానమును మూడు విధముల భూమిమీద మనుషులకు తెలియజేయునని చెప్పి యుండుట వలన దైవగ్రంథములు మూడేనని చెప్పవచ్చును. ఒక్కొక్క విధానము ప్రకారము చెప్పిన జ్ఞానము ఒక్కొక్క గ్రంథముగా మారిపోవుట వలన ప్రపంచములో మూడే దైవగ్రంథములు గలవని గంటాపథముగా చెప్ప వచ్చును. చెప్పినవాడు ఒక్కడే, చెప్పబడిన జ్ఞానము ఒక్కటే అయినందున మూడు దైవగ్రంథములలోని జ్ఞానము ఒక్క దేవున్ని గురించి చెప్పినదే అయినందున మూడు గ్రంథములలో ఒకే దేవుని జ్ఞానము ఎక్కువ తక్కువ అనకుండా ఒకే స్థాయిలోయున్నదని చెప్పవచ్చును. భూమిమీద చెప్పబడిన వరుస క్రమములో ముందు వెనుక యుండుట వలన ప్రథమ దైవగ్రంథమనీ, మధ్యమ లేక ద్వితీయ దైవగ్రంథమనీ, అంతిమ లేక తృతీయ దైవగ్రంథమనీ చెప్పవచ్చును. దేవుడు తన జ్ఞానమును తెలిపిన మూడు విధానముల ప్రకారము మూడు దైవగ్రంథములుగా చెప్పుచున్నాము.

దేవుడు ఆకాశవాణి ద్వారా, తెరవెనుకనుండి, తన ప్రతినిధి ద్వారా మూడు విధముల జ్ఞానము తెలియజేసినా మనకు తెలిసి ఆకాశవాణి ద్వారా ఒకమారు తెలియజేసినట్లు చెప్పగలము. అలాగే తెరవెనుక నుండి రెండుమార్లు తెలియజేసినట్లు చెప్పగలము. ఇంకా మూడవ విధానము ప్రకారము తన ప్రతినిధిని పంపి రెండుమార్లు జ్ఞానమును చెప్పించాడు. ఇవన్నియూ గమనిస్తే ఆకాశము ద్వారా ఒకటి, తెరచాటునుండి రెండు, ప్రతినిధి ద్వారా రెండుమార్లు మొత్తము ఐదుమార్లు చెప్పడమైనది. అయినా

మూడు గ్రంథములే తయారయినవి. చెప్పబడిన విధానమునుబట్టి, వ్రాయబడిన వరుసనుబట్టి దైవగ్రంథములు మూడేయని, అంతకుమించి దైవగ్రంథములు తయారగుటకు వీలులేదని చెప్పవచ్చును. **చివరిలో వ్రాయబడిన గ్రంథమగుట వలన ఖురాన్‌ను అంతిమ దైవగ్రంథమను పేరు ఎప్పటికీ స్థిరస్థాయిగా యుండును. అట్లే మొదట వ్రాయబడిన గ్రంథమగుట వలన భగవద్గీత ఎప్పటికీ ప్రథమ దైవగ్రంథముగానే యుండును. అట్లే బైబిలు ద్వితీయ దైవగ్రంథముగానే యుండును.** ప్రపంచములో ఏది మారినా దైవగ్రంథముల వరుస మాత్రము మారదు. **ప్రథమ, మధ్యమ, అంతిమ** అనునవి వరుస క్రమమేగానీ జ్ఞానస్థాయిని బట్టి పెట్టిన పేర్లు కాదు.

దేవుడు నిర్ణయించిన మూడు విధానముల ప్రకారము ఎన్నిమార్లు చెప్పినా ఒకే దేవుని జ్ఞానమునే చెప్పుచుండుట వలన, ప్రపంచములో వేరే దేవుడు మరొకరు లేనిదానివలన, ప్రపంచమునకంతా సృష్ఠికర్త ఒక్కరే అయిన దానివలన, మూడు గ్రంథములలోయున్నది ఒకే దేవుని జ్ఞానమని సూటిగా చెప్పవచ్చును. మొదట సృష్ట్యాదిలోనే ఆకాశము ద్వారా దేవుని జ్ఞానము చెప్పబడినది. దేవుడు చెప్పిన మూడు విధానములలో మొదటిది ఆకాశ శబ్దము ద్వారా చెప్పబడినది. తర్వాత తెరచాటునుండి చెప్పబడినది. ఆ తర్వాత దైవ ప్రతినిధి ద్వారా చెప్పబడినది. ఇక్కడ చెప్పబడిన విధానములే ముఖ్యముగానీ, ఎవరు ఎన్నిమార్లు చెప్పారు అన్నది ముఖ్యముకాదు. అలాగే గ్రంథములు తయారయిన వరుస క్రమమే ముఖ్యముగానీ, చెప్పిన విధానము యొక్క వరుస ముఖ్యము కాదు.

ఆకాశము మొదట జ్ఞానమును చెప్పినా తర్వాత ఎన్నోమార్లు ఆకాశము తన శబ్దము ద్వారా జ్ఞానమును చెప్పడమైనది. అలాగే

తెరచాటునుండి కనిపించక జ్ఞానమును చెప్పినది మనకు తెలిసి రెండుమార్లే అయినా ఎన్నోమార్లు ఆ పని జరిగియుండునని చెప్పుచున్నాము. ఇకపోతే దైవప్రతినిధి అయిన భగవంతుడు మనకు తెలిసి రెండుమార్లు చెప్పియుంటే, మనకు తెలియకుండా ఎన్నోమార్లు చెప్పియున్నాడు. ఇంకా మనము గమనించవలసిన విషయమేమంటే ఆకాశము ఎన్నిమార్లు చెప్పినా మొదట చెప్పిన జ్ఞానమునే చెప్పుచుండును. ఒకే జ్ఞానమునే అనేక రకములుగా మార్చి చెప్పుచుండుట వలన సరిగా గ్రహించుకోలేని వారు ముందు చెప్పిన జ్ఞానము వేరు తర్వాత చెప్పిన జ్ఞానము వేరని అనుకొను అవకాశము గలదు. ఉదాహరణకు ఒకమారు చెప్పిన వాక్యములో **"అహంభావము లేకుండా ఎంతమందిని చంపినా వానికి హత్యాపాపము రాదు, వాడు హంతకుడు కాడు"** అని చెప్పబడిన జ్ఞానమే మరొకమారు చెప్పినప్పుడు కొంత మార్పుచేసి **"ఒక స్త్రీని మోహపు (కామపు) చూపుతో చూచినట్లయితే అతడు వ్యభిచరించినట్లేయగును"** అని ఉండుట వలన ఒకచోట భావము లేకుండా చేసిన పని చేయనట్లేయని చెప్పి, మరొకచోట భావముతో చేస్తే చేయకున్నా చేసినట్లేయని చెప్పడము వలన ఈ రెండు వాక్యములలోనిది వేరువేరు జ్ఞానమని అనుకొను అవకాశము గలదు. రెండుచోట్ల చెప్పినది ఒకే జ్ఞానమని ఎవరూ గుర్తించలేరు. ఇక్కడ **భావమును** గురించి చెప్పిన ఒకే జ్ఞానమును రెండు విధములుగా యున్నదని చాలామంది తెలియలేక పోయారు. అదే విధముగా మొదట చెప్పిన జ్ఞానమే తర్వాత ఎన్నిమార్లు చెప్పినా, ఎన్ని విధముల చెప్పినా మారకుండా యున్నదని అందరూ గ్రహించ వలసియున్నది.

ప్రపంచమునకంతటికీ ఒకే దేవుడు, ఒకే జ్ఞానము యున్నదని గ్రహించలేని మనుజులు తమతమ జ్ఞానములు వేరువేరని తలచి తాము

వేరువేరు మతములను సృష్టించుకొన్నారు. వేరువేరు మతముల వారు వారి వారి దేవుడు వేరని అనుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా ముఖ్యమైన మూడు మతముల వారు వారివారి దేవుళ్ళు వేరువేరుగా యున్నారని వారి దేవుళ్ళ పేర్లు వేరువేరుగా చెప్పుకొంటున్నారు. వాస్తవానికి ముగ్గురు దేవుళ్ళు లేరు, మూడు రకముల జ్ఞానము లేదు, ఉన్నది ఒకే దేవుడే, ఒకే జ్ఞానమే. అయితే దేవుని ఆజ్ఞతో ప్రవర్తించు మాయ, దేవుని అనుమతితోనే కొందరిని దేవుని వైపు రాకుండా చేయుటకు, వారికి వేరు వేరు దేవుళ్ళుగా, వేరు వేరు మతములుగా అర్థమగునట్లు చేసినది. దానివలన చాలామంది మనుషులు తమకు తెలియకుండానే మాయ ధర్మమైన మను ధర్మములను ఆచరించుచున్నారు. తమకు తెలియకుండానే మతములనా శ్రయించి దేవుని వైపు పోతున్నామని అనుకొనుచూ దేవునికి దూరముగా పోవడము జరుగుచున్నది.

అయితే దేవునికి ఇష్టమైన వారిని మాత్రము దేవునివైపు పోవునట్లు మాయ చేయుచున్నది. దేవుని జ్ఞానము మీద శ్రద్ధగలవారందరినీ, దేవుని మీద ఇష్టత కల్గిన వారినందరినీ మాయ ఏమాత్రము ఆటంకము చేయడము లేదు. కొందరికి జీవిత అనుభవముల వలన దేవుని జ్ఞానము మీద శ్రద్ధ కల్గినా, వారికి తాజాగా చెప్పబడిన జ్ఞానము తెలియుటకు ఒకే జ్ఞానము అనేకమార్లు భూమిమీద చెప్పబడుచున్నది. దేవుడు తెల్పిన మూడు విధానములు కూడా అనేకమార్లు మనముందుకు వచ్చి జ్ఞానమును తెల్పి పోయినవి. ఆకాశము శబ్దరూపములో ఎన్ని ఉరుములు ఉరిమినా, వాటి జ్ఞానము మనకు తెలియకుండా పోయినది. అలాగే మనకు కనిపించని తెరచాటుగాయున్న గ్రహములు సూక్ష్మముగా ఎన్నిమార్లు జ్ఞానమును తెల్పినా వాటిని గ్రహించుకొను శక్తి మనుషులకు లేకుండా పోయినది. ఉరుముల

శబ్దము వినిపించినా వాటిని గ్రహించుశక్తి ఆకాశములోని గ్రహములకే కలదు. అలాగే కనిపించని తెరచాటునయున్న సూక్ష్మముగాయున్నవారు చెప్పు బోధను ప్రవక్తలకు మాత్రమే చెప్పుచున్నారు. దేవుడు తెల్పిన మూడు విధములలో బోధల రూపములో ఆకాశవాణి చెప్పు బోధను ఆకాశ గ్రహములు, తెరచాటునుండి చెప్పు బోధలను ప్రవక్తలు యోగ్యత యున్న వారు మాత్రము తెలియగలరు. సాధారణ మనుషులలో మానవులుగా యున్నవారు గానీ, ప్రజలుగా యున్నవారుగానీ ఎవరుగానీ పైన చెప్పిన రెండు విధానముల జ్ఞాన బోధలను తెలియలేరు. కావున మనుషులు ఎవరూ దైవ జ్ఞానమును తెలియుటకు అవకాశము లేదు. అందువలన సాధారణ మనుషులు ఎవరయినా జ్ఞానమును తెలియుటకు అవకాశ ముండునట్లు సాధారణ మనిషివలె యున్నవాడు బోధించునట్లు ఏర్పరచిన విధానమే దేవుని మూడవ విధానము. దేవుని మూడవ విధానములో దేవుని ప్రతినిధి స్వయముగా సాధారణ మనిషివలె మనుషుల మధ్యలోనికి వచ్చి దైవ జ్ఞానమును చెప్పిపోవడము జరుగుచున్నది. దేవుడు మారు వేషములో వచ్చి తనను ఎవరూ గుర్తుపట్టనట్లు ప్రపంచములో మనుషుల మధ్య మనిషివలె నటించి పోవుచున్నాడు. మనిషివలె వచ్చి పోయిన తర్వాత కొంతకాలానికి కొందరు వచ్చిన వానిని గుర్తించగలిగినా, వచ్చినవాడు దేవుని ప్రతినిధియని తన జ్ఞానములోనే చెప్పాడు. ప్రతినిధియని చెప్పినా అది ధర్మవిధానము ప్రకారము చెప్పినది మాత్రమేయని తెలియుచున్నది.

విశ్వములో దేవుడు తప్ప దేవుని ప్రతినిధిగానీ, దేవుని గుమాస్తాగానీ, దేవుని కుమారుడుగానీ ఎవరూ లేరని దేవుని జ్ఞానమును పూర్తిగా అర్థము చేసుకొన్న వానికి తెలియగలదు. దేవుని జ్ఞానమును సంపూర్ణముగా అర్థము చేసుకోగలిగినవాడు ఎవడయినా దేవుని ప్రతినిధిగా వచ్చిపోయిన వాడు

దేవుడేగానీ ఇతరులు ఎవరూ కాదని అర్థము చేసుకోగలడు. గతచరిత్రలో దేవుడు ఎన్నిమార్లు మనిషిగా (భగవంతునిగా) వచ్చిపోయాడో ఖచ్చితముగా చెప్పలేకపోయినా నాకు తెలిసినంత వరకు రెండు అవినాభావ సంబంధమున్న జన్మలను గుర్తించగలిగాము. సృష్ట్యాదినుండి దేవుడు భగవంతునిగా అనగా మనిషి రూపములో ఎన్నోమార్లు వచ్చియుండవచ్చును. అయితే వెంట వెంటనే వచ్చిన జన్మలు, రెండూ ఒకే పోలికయున్న జన్మలు మా దృష్టికి రాగా వాటిని సులభముగా గుర్తించగలిగాము. మనుషులకు జ్ఞానమును తెలియజేయు నిమిత్తము దేవుడు మనిషిగా ఒకమారు కాకుండా ఎన్ని మార్లయినా రావచ్చును. ఎన్నిమార్లు మనిషిగా వచ్చినా అది దేవుడు మనుషులకు జ్ఞానము తెలుపు మూడు విధానములలో ఒక్క విధానమే యగును. దేవుడు తన ప్రతినిధి ద్వారా జ్ఞానము తెలుపుదునని చెప్పిన ప్రకారము, ద్వాపరయుగమున దేవుడు కృష్ణుని రూపమున వచ్చిపోయాడు. అలా రావడము వలన ఆయన చెప్పిన జ్ఞానము ఒక దేశమునకే పరిమితియై పోయినది. ద్వాపరయుగము చివరిలో వచ్చిన కృష్ణుని వలన కొంత జ్ఞానము మనుషులు తెలియగలిగినా, మిగతా దేశములలో ఆసక్తియున్న వారికి జ్ఞానమును తెలుపు నిమిత్తము వెంటనే కలియుగము మొదటిలోనే దేవుడు రెండవమారు రావడము జరిగినది. దగ్గరదగ్గరగా వచ్చినదయిన దానివలన, ప్రక్క దేశములోనే అవతరించడము వలన, ఆ రెండు జన్మల మీద కొంత ధ్యాస కల్గి గుర్తించుటకు అవకాశము ఏర్పడినది.

మానవునిగా భగవంతుని రూపములో వచ్చునని కొందరికయినా తెలియుటకు దేవుడు అటువంటి అవకాశమిచ్చాడని అనుకొంటున్నాము. దేవుడు భూమిమీద మనిషిగా వచ్చునను వాదనకు సాక్ష్యముగా యుండుటకు, దేవుడు తన జన్మలు తెలియజేయుటకు, ఒకే పోలిక యున్నటు

వంటి మూడువేల సంవత్సరములకు రెండవ జన్మ తీసుకోవడము జరిగినది. సాధారణముగా దేవుడు కొన్ని లక్షల సంవత్సరములకొకమారు రావలసి యుండగా, ఇక్కడ రెండు జన్మలలో తక్కువ వ్యవధిలో మూడు వేల సంవత్సరములకే భగవంతుని రెండవ రాక జరిగినది. సామాన్యముగా ఎవరుగానీ, దేవుని జన్మ అయిన భగవంతున్ని గుర్తించలేరు. దేవుని జన్మను గుర్తించుటకు వీలులేకుండా మాయ అందరినీ మభ్యపెట్టగలదు. ఎవడయినా భగవంతుని గుర్తించినా, వానిలో అనుమానములను పుట్టించి చివరికి వానిచేతనే అతను భగవంతుడు కాదు అని అనిపించును. మాయ మనిషిని ఏమయినా చేయగలదు. అందువలన దేవుని జన్మను గుర్తించనట్లు మనిషిని మాయ ప్రేరేపించుచున్నది. మనిషికి తెలిసిన జ్ఞానము చేత దేవునికి జన్మలు లేవు, దేవుడు పుట్టువాడు కాదని వాదించునట్లు చేయును.

ఎవడు దేవునికి ఇష్టుడుగాయుండునో వానికి మాత్రమే దేవుడు భగవంతుడుగా వచ్చునని నమ్మునట్లు మాయ చేయుచున్నది. మిగతా వారికి వారివారి మతముల జ్ఞానమును ప్రేరేపించి, మా జ్ఞానము వలన దేవుడు పుట్టడని తెలియునట్లు మాయయే చేయుచున్నది. అటువంటి వారు అనగా మాయా ప్రభావములో పడిపోయిన వారిని, వారి దైవగ్రంథము లలో దేవుడు అవతరిస్తానని చెప్పినా, ఆ మాటను లెక్కచేయనట్లు వారిని ప్రేరేపించి దేవుడు పుట్టడని చెప్పించుచున్నది. అటువంటప్పుడు అసలయిన సత్యము వారికి తెలియకుండా పోవుచున్నది. మాయ మమ్ములను మాత్రము సక్రమ మార్గములో నడిపించి దేవునికి జన్మలున్నాయని తెలియునట్లు చేసినది. అంతేగాక ఫలానా జన్మలు దేవునివేనని గుర్తించునట్లు చేసినది. భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్యాయోగమను అధ్యాయమున పదకొండవ శ్లోకమును గుర్తుగా చూపి దానివలన దేవునికి జన్మలున్నట్లు తెలియజేసినది.

**రాజవిద్యా రాజగుహ్యా యోగము :-**

శ్లో॥ 11. అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

**భావము :- "సర్వ జీవరాసులకు మహేశ్వరుడనయ్యు, మానవ శరీరము ధరించిన నన్ను జూచి నా శ్రేష్ఠత్వమును తెలియని మానవులు అజ్ఞానులై నన్ను అవమానించు చున్నారు"**

**జ్ఞాన యోగము :-**

శ్లో॥ 9. జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వ తః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున! ॥

**భావము :- కొద్దిమాత్రమయినా నా యొక్క దివ్యమైన జన్మలను, నా పనులను తెలియగలిన మనిషి ఎవడయినా మరణించిన తర్వాత వాడు పునర్జన్మ పొందడు. అట్టివాడు నాలోనికి ఐక్యమగును, నాశనము లేని మోక్షమును పొందును.**

ఈ రెండు శ్లోకముల భావమును చూచిన తర్వాత దేవునికి జన్మలు లేవని, దేవుడు పుట్టడని ఎవడూ చెప్పడు. ఈ విషయము ప్రథమ దైవ గ్రంథములోయుండగా, మిగతా రెండు గ్రంథములలో కూడా దేవుడు పుట్టునను బోధయే కలదు. అయితే మాయ ప్రభావము వలన కొందరికి ఆ విషయమే అర్థము కాలేదు. వారి విషయమును వదలి, దేవుడు పుట్టునని మనము చెప్పుకోగలిగితే, కొంతవరకు గొప్ప జ్ఞానము తెలిసినట్లేయగును. ప్రపంచమునకు అంతటికీ దేవుడు ఒక్కడే విశ్వరాజ్యాధిపతిగా యున్నాడు. మనము ఇప్పుడు ఆయనను దేవుడని చెప్పుచున్నా సృష్ట్యాదిలోనే ఆయనకు **సృష్టికర్త, పరమాత్మ, అల్లాహ్** అను మూడు బిరుదులు గలవు. ఆయనే ఇప్పుడు మనము చెప్పుచున్న దేవుడని తెలియవలెను.

'పనిని బట్టి బిరుదు ఉండును' అను సూత్రము ప్రకారము దేవుడు ఉన్న విధానమునుబట్టి ఆయనకు ఆనాడే సృష్ట్యాదిలోనే బిరుదులు లభించినవి. దేవులాడబడేవాడు దేవుడు అన్నట్లు, సృష్టిని సృష్టించిన ఏకైక కర్త అయిన దానివలన దేవున్ని **"సృష్టికర్త"** యని చెప్పబడినది. అలాగే ఆత్మకంటే వేరుగా యున్నవాడు దేవుడు అయినందున అదే అర్థముతో **"పరమాత్మ'** అని అనడము జరిగినది. ఆత్మకంటే పరముగా యున్నవాడని దాని అర్థమని చాలామందికి తెలియక అదియొక పేరని కొందరు అనుకోవడము అయినది. అలాగే నేడు ముస్లీమ్‌ల దేవుని పేరని అందరూ అనుకొను **"అల్లాహ్"** అను బిరుదు సృష్ట్యాదిలోనే అర్థసహితముగా యుండేది. "ల్లాహ్" అనగా అంతుయని, గట్టుయని చెప్పవచ్చును. "అల్లాహ్" అనగా అంతులేనివాడని వివరమునిచ్చునది. **"అల్లాహ్" పదము యొక్క అర్థము స్వచ్ఛమయిన తెలుగు భాషలోనిదని కూడా చాలామందికి తెలియదు.** పూర్వమే సృష్ట్యాదిలోనే అర్థముతో కూడుకొన్న బిరుదాంకితుడు దేవుడని ఎవరికీ తెలియక దేవునికి పేర్లున్నాయని అందరూ అనుకోవడము జరిగినది. దేవునికి పేర్లవలెయున్నవన్నీ బిరుదులేనని, పేరు ఒక్కటి కూడా లేదని తెలిసిన వారికి దేవుడు నామరహితుడని తెలియగలదు. వెతకబడేవాడే గానీ కనిపించేవాడు కాడని తెలిసిన వారికే దేవుడు రూపము లేనివాడని తెలియగలదు. చైతన్యవంతమై అన్ని కార్యములు చేయు ఆత్మయు కాకుండా, ఆత్మకంటే వేరుగా సాక్షిగా దేవుడున్నాడని తెలిసిన వారికే పరమాత్మయంటే క్రియారహితుడని తెలియగలదు.

రూప, నామ, క్రియారహితుడైన దేవుడు ఖురాన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌నందు చెప్పినట్లు **"తనకు తప్ప ఇతరులకు తెలియని తన జ్ఞానమును తానే పరోక్షముగా మూడు విధముల**

**తెలియజేతునని"** చెప్పినట్లు తన సృష్ఠిలో ఆకాశ ఉరుముల ద్వారా ఒక విధముగా, సూక్ష్మ రూపముగా మరొక విధముగా తెలిపినా, ఆ బోధ నేరుగా మనుషులకు చేరక ఆకాశములోని గ్రహములకు ఆకాశబోధ, సూక్ష్మమును గ్రహించు ప్రవక్తలకు తెరచాటునుండి తెల్పిన బోధ చేరిపోగా, దేవుడు చెప్పినది చెప్పినట్లు మనుషులకు చేరకపోవడము వలన, చివరకు ప్రవక్తలు మనుషులకు తెల్పిన జ్ఞానము కూడా కొంత కాలమునకు కలుషితమై పోవుటకు అవకాశముండుట వలన, దేవుని ప్రతిరూపమైన (ప్రతినిధియైన) భగవంతుని ద్వారా మూడవ విధానమును అనుసరించి ప్రజలకు జ్ఞానమును చెప్పడము జరిగినది. ఆకాశమునుండి చెప్పినప్పుడు గానీ, తెరచాటునుండి సూక్ష్మరూపములో చెప్పినప్పుడు గానీ దేవున్ని గుర్తించుటకు అవకాశము లేదు. అయితే మూడవ విధానమైన దేవుని ప్రతినిధి వచ్చి జ్ఞానమును బోధించినప్పుడు నేరుగా ప్రజలకే బోధించుచూ, మనుషులతో సంబంధపడి, మనుషుల మధ్యలోనే ఉండుట వలన, వచ్చిన ప్రతినిధినిబట్టి దేవుని నిజ భావమును కొంతవరకు తెలియుటకు అవకాశము గలదు. అందువలన ఇప్పుడు మనము దేవునిచేత పంపబడిన దేవుని ప్రతినిధిని గురించే చర్చించుకొందాము.

అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 42, ఆయత్ 51లో చెప్పిన విషయమందు చివరి వాక్యములో **"తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని పంపుతాడు"** అని గలదు. అంతేగాక అదే మాట చివరిలో మరొక ముఖ్యమైన మాట చెప్పడమైనది. అది ఏమనగా! అలా తన ప్రతినిధిగా వచ్చినవాడు **"మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు"** అని చెప్పడమైనది. దేవుడు రూప, నామ, క్రియారహితుడు. అంతేకాక ఆయన వెదికితే కనిపించువాడు కాడు. పనిచేయు ఆత్మయు

కాదు (పరమాత్మ), అంతుగానీ, హద్దుగానీ లేనివాడు (అల్లాహ్) ఏ అంచనాకు తెలియనివాడు అయినందున దేవున్ని ప్రత్యక్షముగా ఎవరూ తెలియలేరు. అయితే దేవుడు తన ప్రతినిధిని పంపుతానని చెప్పి పంపినప్పుడు వచ్చినవాడు దేవుని ప్రతినిధిగా యున్నా, ఆయన దేవుడేనని మనకు జ్ఞానము వలన అర్థమయినప్పుడు, ఆయన ప్రతినిధియైన భగవంతున్ని మానవా కారములో చూచినప్పుడు, ఆయన ద్వారా దేవుని భావమును తెలియుటకు అవకాశము గలదు.

ఖురాన్ వాక్యములో చివరిగా చెప్పినమాటలో మరీ చివరిగా యున్న మాటలలో ఆయన **"మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు"** అని గలదు. స్వల్పమైన మనుషుల ప్రక్కలో దేవుని ప్రతినిధిగా వచ్చిన వానిని చూస్తే స్వల్పమైన మనుషులకంటే, కనిపించు మనిషిగా యున్న భగవంతుడు 'ఎంతో ఉన్నతుడు' అని తెలియుచున్నది. అలాగే కనిపించే మనుషుల వివేకము (తెలివి) కంటే భగవంతుని వివేకము ఎంతో గొప్పగాయుండును. అందువలన ఆయనను 'ఎంతో వివేకవంతుడు' అని చెప్పడమైనది. కనిపించే మనిషిగాయున్న భగవంతున్ని కనిపించే మనుషులతో పోల్చి చూచినప్పుడు దేవుని ప్రతిరూపమైన లేక దేవుని ప్రతినిధియైన వాడు మనుషుల భావము కంటే ఉన్నతమైన భావము కలవాడనియూ, మనుషుల వివేకముకంటే ఎంతో ఎక్కువ వివేకము గలవాడని తెలియుచున్నది. కనిపించని దేవుడు కనిపించే మనిషిగా వచ్చినప్పుడు మాత్రమే ఆయనను మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడని చెప్పుటకు అవకాశము గలదు. అదే దేవున్ని అలా చెప్పుటకు ఏమాత్రము వీలులేదు. దేవుడు కనిపించనివాడు, ఏదీ కానివాడు అయినందున ఆయనను ఎవరితో పోల్చి చూచుటకు అవకాశము లేదు. అందువలన దేవున్ని ఉన్నతుడని చెప్పుటకు, వివేకవంతుడని చెప్పుటకు అవకాశము లేదు. ఏదీ కానివానిని ఏమనీ చెప్పలేము.

దేవుడు అవతరించి మానవ రూపములో వచ్చినప్పుడు ఆయనను మనిషియని అనకూడదు. దేవుడు మానవునిగా మన మధ్యయుండినా ఆయనను మానవుడనిగానీ, మనిషియనిగానీ, ప్రజ అనిగానీ చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! ప్రత్యక్షముగా మనిషివలె కనిపించినా ఆయన మనిషికాడు, ఆయనను మనిషి అని అనకూడదు. ప్రస్తుతానికి ఆయన భూమిమీద ఉన్నప్పుడు ఆయన దేవుని అవతారమని తెలియకపోవడము వలన తెలియక మనిషిగా పోల్చుకొనినా, తర్వాత ఎప్పుడయినా ఆయన దేవుని అవతారమని తెలిసిన తర్వాత భగవంతుడని చెప్పవలెను. భగవంతుడను పేరు ఒక్క దేవుని అవతారమునకు మాత్రమే ఉండును. అటువంటి అవతారములు నాకు రెండు తెలిసినవి. అందువలన ఇప్పుడు నేను వారిని భగవంతుడని చెప్పుచున్నాను. తెలియనప్పుడు భగవంతున్ని ఎవరూ గుర్తించలేనప్పుడు ఆయనను ఎలా పిలిచినా ఫరవాలేదు. అయితే ఆయన జన్మను గురించి తెలిసిన తర్వాత దేవుని జన్మను తప్పక భగవంతుడని పిలువవలెను అలా పిలిచినప్పుడే దేవుని జన్మను గురించి తెలిసినవాడగుదురు.

**ప్రశ్న :- భగవంతుడని దేవుని జన్మను అనాలని మీరు చెప్పుచున్నారు. మీరు చెప్పే ప్రకారమైతే దేవుని జన్మ భూమిమీద చాలా అరుదుగా జరుగు చుండునని తెలియుచున్నది. భగవద్గీతలో కూడా అధర్మములు చెలరేగి ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు మాత్రమే దేవుడు అవతరించి ధర్మ ప్రతిష్టాపన చేయునని చెప్పియున్నారు. ఇదంతయూ చూస్తే కొన్ని లక్షల సంవత్సరములకో, తక్కువ అంటే కొన్ని వేల సంవత్సరములకొకమారు దేవుని జన్మయుండవచ్చునని తెలియుచున్నది. అలా ఎంతో కాలమున కొకమారు దేవుని జన్మయున్నా దానిని మనుషులు గుర్తించుట చాలా**

**దుర్లభము. భగవంతుని రాక అరుదైనప్పుడు, భగవంతుని గుర్తింపు బరువైనప్పుడు నేడు భూమిమీద ఎందరో 'భగవాన్' అను పేరు కల్గిన వారు, 'భగవాన్' అని పిలిపించుకొనువారు చాలామంది కనిపించుచున్నారు. వీరిలో ఎవరు భగవంతుడని మేము అనుకోవాలి? భూమిమీద భగవంతుడు ఉన్నప్పుడు తెలియబడడు. ఆయన వచ్చిపోయిన ఎన్నో సంవత్సరములకు గానీ, ఆయన చేసిన పనులనుబట్టి, చెప్పిన జ్ఞానమునుబట్టి ఫలానావాడు భగవంతుడని గుర్తుపట్టుటకు అవకాశముండును. అటువంటి ఎంతో కష్టమైనదిగా భగవంతుని గుర్తింపుయుండగా, ప్రత్యక్షముగా కనిపించు భగవంతులు ఇంతమంది యుండుటను మీరేమంటారు? ఒక గొప్ప స్వామీజీ దగ్గరనుండి సాధారణ మనిషి వరకు వారి పేరుకు ముందో లేక వెనుకో భగవాన్ అను పేరు కలిపించుకొన్నారు. వీరు నిజముగా భగవంతులా లేక ఇంకా ఏమయినా అర్థము గలదా?**

**జవాబు :-** భూమిమీద ప్రత్యక్షముగా బ్రతికియున్నవారు భగవంతుడను పేరును వారి పేరుకు ముందో వెనకో పెట్టుకొనియుండుట నిజమే. నీవు అడిగినట్లే నేను ఒక స్వామీజీని నీవు భగవంతునివా? అని అడిగాను. ఆ స్వామీజీ తన పేరుకంటే ముందే భగవాన్ అని చెప్పుకోవడము జరిగెడిది. ఆయన పేరు "భగవాన్ గోపికా శ్రీవర్ధన్ స్వామీజీ" అని యుండెడిది. ఆయన ఉత్తర దేశము స్వామీజీ అయినందున హిందీ భాషనే మాట్లాడేవాడు. అప్పుడు ఆయన నాతో ఈ విధముగా మాట్లాడాడు.

**భగవాన్ :-** నేను 'భగవాన్' అను పేరును నా పేరు ముందు పెట్టుకుంటే నీకు ఏమనిపించినది? చెడుగా ఏమయినా కనిపించినదా? నీవు భగవాన్‌వేనా అని ఎందుకు ప్రశ్నించావు?

**నేను :-** దేవుడు భూమిమీద పుట్టినప్పుడు ఆయనను భగవంతుడు అనడము సహజము. జ్ఞానమును తెలిసినవారు మాత్రమే భగవంతుని జన్మను గుర్తించి, మనిషిగా వచ్చిన దేవున్ని భగవంతుడని అనవచ్చును. అటువంటి 'భగవాన్' అను పేరును మీరు పెట్టుకోవడము వలన దాని విషయమేమని, ఎందుకు అలా పెట్టుకొన్నారని అడిగాము.

**భగవాన్ :-** కృష్ణుడు పుట్టినప్పుడు ఆయనకు 'భగవాన్' అను పేరు లేదు. ఆయన తర్వాత కొంత కాలమునకు ఆయనను భగవాన్ అని అందరూ అనడము జరిగినది. 'భగవాన్' అను పదములో అర్థమును పరిశీలించితే 'భగము' అనగా 'స్త్రీయొక్క గర్భము' అని అర్థము. గర్భమునుండి పుట్టినవాడు కనుక ఆయనను 'భగవంతుడు' అని అన్నారు. మొదట శ్రీకృష్ణున్ని మనిషి కాదు దేవుడని, ఆయన తల్లిగర్భమునుండి పుట్టలేదనీ, కృష్ణుడు ఆకాశము నుండి శిశువుగా భూమిమీదకు వచ్చాడని అందరూ అనుకొనెడివారు. అయితే కొంత కాలమునకు కృష్ణుడు ఆకాశమునుండి దిగి రాలేదని, దేవకీ దేవి గర్భమునుండి పుట్టివచ్చాడని అందరికీ తెలిసిపోయినది. అప్పుడు అందరూ కృష్ణున్ని 'శ్రీకృష్ణ భగవాన్' అని అన్నారు. అది కృష్ణుని విషయము కాగా నా విషయములో నేను తల్లిగర్భమునుండి పుట్టానని నాకు బాగా తెలుసు, నేను మొదట తల్లిగర్భమునుండి పుట్టిన తర్వాత నాకు పేరు పెట్టారు. ఇప్పుడు స్వామీ అని అంటున్నారు. నేను మొదట తల్లిగర్భములో పుట్టానని అందరికి తెలియుటకు నేను నా పేరు ముందరనే 'భగవాన్' అను పేరును పెట్టుకొన్నాను. నేను పుట్టిన తర్వాత నాకు పేరు పెట్టబడినది. అందువలన భగవాన్ పేరు తర్వాత 'గోపికా శ్రీవర్ధన్' అను పేరును వ్రాయడము జరుగుచున్నది.

కృష్ణుడు పుట్టిన చాలా రోజులకు, ఆయనకు కృష్ణుడు అని పేరు పెట్టిన తర్వాత ఎంతో కాలమునకు కృష్ణుడు పైనుండి దిగి రాలేదని, ఆయన తల్లిగర్భమునుండి పుట్టాడని అందరికీ తెలిసినది. అందువలన ఆయన పేరును ముందు చెప్పి తర్వాత భగవాన్ అని చెప్పుచూ 'కృష్ణభగవాన్' అని అనడము జరుగుచున్నది. నేను ముందు పుట్టానని తర్వాత పేరు పెట్టబడినదని తెలుపుటకు నా పేరుముందు భగవాన్ పేరుండగా, కృష్ణునికి పేరు పెట్టిన తర్వాత గర్భమునుండి పుట్టాడని తెలియుట వలన ఆయన పేరు తర్వాత భగవాన్ అని పేరుపెట్టి 'కృష్ణభగవాన్ అని చెప్పుచున్నాము. నా పేరు అలా కాకుండా 'భగవాన్ గోపికా శ్రీవర్ధన్ స్వామీజీ' అని చెప్పబడు చున్నది. కృష్ణుని పేరు వెనుక భగవాన్‌యుండగా మా పేరుముందర భగవాన్ అనియుండడమును మీరు గమనించకుండా అడిగారు. భగవాన్ ముందువుంటే ఒక అర్థము, వెనుకయుంటే మరొక అర్థముంటుందని తెలియక నీవు నన్ను అడిగావని తెలియుచున్నది. ఇప్పుడు నేను చెప్పిన తర్వాత వివరముగా అర్థమయిందా!

**నేను :-** భగవాన్ అంటే భగమునుండి పుట్టినవాడనియు లేక తల్లిగర్భము నుండి పుట్టినవాడని మీరే చెప్పుచున్నారు కదా! గోపికా శ్రీవర్ధన్ స్వామీజీ అని పేరుపెట్టబడిన మీరు తల్లిగర్భము నుండి పుట్టారా? అని నేను మిమ్ములను ప్రశ్నించుచున్నాను.

**భగవాన్ :-** తల్లిగర్భము నుండి పుట్టాననియే తెలియునట్లు భగవాన్ అని పేరు పెట్టుకొన్నాను. అందరూ తల్లిగర్భమునుండియే పుట్టుచున్నారని ప్రతి ఒక్కరికీ తెలుసు. ఇప్పుడు నన్ను ప్రత్యేకముగా నీవు తల్లి గర్భమునుండి పుట్టావా! అని అడగడములో అర్థమేమిటి? అలా అడుగవలసిన పనేముంది?

**నేను :-** భూమిమీద పుట్టిన ప్రతి ఒక్కడు తాను తల్లిగర్భము నుండి పుట్టానని

అనుకోవడము సహజము. అయితే నేనుగానీ మరి ఎవడుగానీ జన్మించిన ప్రతి ఒక్కడు తల్లిగర్భమునుండి సజీవముగా పుట్టలేదు. శిశుశరీరము తల్లిగర్భము నుండి పుట్టిన తర్వాత 'జీవుడు' అనబడు ప్రతి ఒక్కడు శిశు శరీరములో చేరి జన్మను తీసుకోవడము జరుగుచున్నది. ఇది జగమునకు తెలియని సత్యము. ఆ సత్యము మీకు కూడా తెలియదనియే మిమ్ములను ప్రశ్నించడము జరిగినది. ఉన్న విషయము చెప్పాను కదా! ఇప్పుడు చెప్పండి నీవు నీ శరీరముతో సహా తల్లిగర్భమునుండి పుట్టావా? లేక పుట్టిన శరీరములో కొంతసేపటికి ప్రవేశించి జన్మించావా చెప్పగలవా? మీ విషయము మీకు జ్ఞాపకము లేని సమయములో జరిగిపోయినది. కావున మీకు మీ విషయము మీద అవగాహన లేకపోయి ఉండవచ్చును. ఇప్పుడు ప్రస్తుత కాలములో ఎందరో ప్రతి క్షణము పుట్టుచున్నారు కదా! పుట్టుచున్న వారివద్దకు పోయి ప్రత్యక్షముగా చూచినట్లయితే నేరుగా తల్లిగర్భమునుండి ఎవరూ పుట్టలేరని తెలియగలరు. తల్లిగర్భమునుండి నేరుగా ప్రాణముతో జీవము గల్గి పుట్టువాడు ఎవడయినా ఉన్నాడేమో చెప్పగలరా? పుట్టువారిని వంద సంవత్సరములు గమణించి చూచినా, తల్లిగర్భము నుండి పుట్టిన వానిని ఒక్కనిని కూడా చూపలేవు.

ఒక్క దేవుడు తప్ప తల్లిగర్భమునుండి సజీవముగా పుట్టువాడు ఎవడూ లేడు. ఆ విషయము నీకు తెలియక నీ పేరుముందర 'భగవాన్' అని చెప్పుకొనుచున్నావు. ప్రపంచములో సర్వవ్యాపి అయిన దేవుడు ఒక్కడు తల్లిగర్భము నుండి భగవంతునిగా పుట్టగలడు. మిగతా వారందరూ తల్లిగర్భము బయట శిశు శరీరములో చేరడము వలన ఎవరూ భగవంతుడను పేరుకు అర్హులు కారు. కృష్ణుడు నిజమైన భగవంతుడు అయినా ఆయన ఉన్నప్పుడు ఆయన భగవంతుడని ఎవరికీ తెలియదు. ఆయన వచ్చి పోయిన తర్వాత నిజమైన భగవంతుడు, నిజమైన దేవుడు అని తెలిసినది.

ఆయన పోయిన తర్వాత ఎంతో వెనుక కాలములో ఆయన భగవంతుడని తెలియుట వలన కృష్ణుడు అను పేరు వెనుక భగవాన్ అని చెప్పడము జరిగినది. ఆయన ఎవరయినది ముందే తెలిసియుంటే, ఆయన బ్రతికి యున్నప్పుడే తెలిసియుంటే ఆయన పేరుముందర భగవాన్ అని చెప్పి యుండేవారము. ముందు తెలియదు, ఆయన వచ్చి పోయిన తర్వాత వెనుక తెలిసినది కావున ఆయన పేరు వెనుక భగవాన్ చేర్చి **"శ్రీకృష్ణ భగవాన్"** అని చెప్పాము. పేరు వెనుక భగవాన్ అని ఎందుకన్నామో మీకు ఇప్పుడు తెలిసిందా?

మీరు రూపాయలో ఒక పైసా భాగము కూడా భగవంతుడు కాకపోయినా భగవంతుడని అక్రమముగా పేరు పెట్టుకోవడమేకాక ముందు పెట్టుకొన్నందుకు తప్పు అర్థమును చెప్పుచున్నారు. మొదటికే మీరు భగవంతులు కాకపోయినా భగవంతుడని దేవుని బిరుదును తగిలించు కోవడము పెద్ద తప్పగును. నిన్ను నీవు దేవుడంతటి వానిగా చెప్పుకొన్నట్ల గుచున్నది. అది మీకు మంచిదేమో మీరే చెప్పండి. తెలియక చేసిన తప్పును లేకుండునట్లు ఇప్పటికయినా మీరు వెంటనే 'భగవాన్' అనే మొదటి హోదాను తీసివేయండి. 'భగవాన్' అను పదమునకు నిజమైన అర్థమును తెలిసి అది దేవుని జన్మకే అర్హమైనదని తెలిసి దేవుని జన్మను భగవంతుడని చెప్పుట మంచిది. దేవుడు సర్వవ్యాపి ఆయన అంతటా అణువణువునా నిండిన వాడు తల్లిగర్భములో కూడా యున్న పరమాత్మ గర్భములోని శిశు శరీరములో కూడా వ్యాపించియుండుట వలన ఆయన ఇంకొకచోటు నుండి వచ్చి పుట్టువాడు కాడు. దేవుడు సర్వవ్యాపి అయినందున తల్లిగర్భమునుండి సజీవముగా పుట్టుచున్నాడు. సాధారణ జీవాత్మ ఇంకొకచోట మరణించి అక్కడనుండి వచ్చి ప్రసవించబడిన శరీరములో పుట్టుచున్నది.

గారడివిద్య యొక్క పనితనమని మనందరికీ తెలుసు. మనిషిని రెండు ముక్కలుగా చేయడము స్టేజి (వేదిక) మీద గారడివిద్య కావచ్చును. అదే నడి బజారులో ఒకరు ఇంకొకరిని కత్తితో రెండు ముక్కలు చేస్తే అక్కడ రక్తము కారిపోతుంది. ముక్కలైన వాడు చనిపోతాడు. అప్పుడు అది గారడివిద్య కాదు, జరిగినది సత్యమని తెలియుచున్నది. అలా జరిగిన దానిని గారడివిద్య అని ఎందుకు అనలేదనగా, ముక్కలైనవాడు చనిపోయాడు. వానినుండి రక్తము కారిపోవడము వలన వాడు చనిపోయాడు. చంపినవానిని హంతకుడు అంటాము. జరిగిన దానిని హత్య అంటాము. అప్పుడు చంపినవాడు గారడివాడు కాదు, జరిగినది గారడివిద్య కాదు. ఇన్ని విపులముగా తెలిసినపుడు, దాని ప్రకారమే శాస్త్రబద్ధముగానున్న విషయములను మేము చెప్పినపుడు, మా మాటలు సత్యమా, అసత్యమా అని ఎందుకు తెలియలేదని ప్రశ్నించుచున్నాను. కొన్ని ఆధారములతో యోచిస్తే ఏది నిజమో, ఏది నిజము కాదో మీకే అర్థమవు తుంది. ఎదురుగా కనిపిస్తున్నా త్రొంగి చూడడము, నిక్కి చూడడము, ఎగిరి చూడడమునకు అర్థమే లేదు.

ఈ అధ్యాయము మొదటిలో **"కృష్ణుని మరణము లోకానికి కనువిప్పు"** అని మొదలుపెట్టి చెప్పాము. నరకాసురుడు చనిపోతే ప్రజలకు సంతోష మైనది. కానీ ఇక్కడ కృష్ణుడు చనిపోతే లోకానికి కనువిప్పు అని మేము చెప్పలేదు. కృష్ణుని మరణము లోకానికి కనువిప్పా? అన్నాము. దానినిబట్టి మరణ సమయములో ఏదో గొప్ప రహస్యమున్నదనీ, అది తెలిస్తే ఇంతవరకు కన్నులు మూసుకొన్నవారు కళ్ళు తెరుచుకొంటారని అర్థమవుచున్నది. ఇక్కడ ముఖ్యమైన ఘట్టము ఏమనగా! ఇంతవరకు ఏ విషయములో గ్రుడ్డిగా ఉన్నాము? ఇప్పటినుండి దేనియందు చూపుకల్గి

వుండాలి? అని ప్రశ్న వచ్చుచున్నది. మనకు ఇంతవరకు వున్న గ్రుడ్డి తనమేమిటో, అది కృష్ణుని మరణమును తెలుసుకొనుట వలన ఎలా చూపుగల్గుతుందో, అందరము తెలుసుకోవాలి. నేడున్న ప్రపంచ జనాభాలో 80 శాతము క్రైస్తవులున్నారు. రెండవస్థానమును ఆక్రమించినది ఇస్లామ్‌మతము. తర్వాత బౌద్ధమతము, ఆ తర్వాత హిందూమతము. హిందూమతము నేడు చివరి స్థానములో ఉన్నది. కృతయుగము, త్రేతాయుగము గడిచిపోగా ద్వాపరయుగము మొదటిలో హిందూమతము ప్రపంచ వ్యాప్తంగా ఖండాంతరముల వరకు వ్యాపించి ఉండెడిది. నేడు మనము హిందూమతముగా పిలుచుకొనునది ఆనాడు హిందూమతము అను పేరుతో లేదు. ద్వాపరయుగము మొదటి కాలములో "మతము" అనుపేరు భూమిమీదనే లేదు. అప్పటికాలములో "పథము" అను పేరుండెడిది. హిందూ అను పదము 'ఇందూ' అను పదముగా, అర్థముతో కూడుకొన్నదై ఉండెడిది. ఆనాడు ఇందూపథము అనునది ప్రపంచ వ్యాప్తముగా ఉండెడిది. ప్రపంచములోని మనుషులందరు మేము ఇందువులము అని చెప్పుకొనెడివారు. పథము అనగా మార్గము అని అర్థము 'ఇందు' అనగా చంద్రుడు అని అర్థము. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము జ్ఞానమునకు చంద్రుడు అధిపతియైన దానివలన, ఆ రోజు దైవ జ్ఞానము కలవారిని ఇందువులు అని చెప్పెడివారు. జ్ఞానమార్గములో నడిచేవారందరిని జ్ఞానపథములోని వారని అనెడివారు. అందువలన జ్ఞానులు మాది ఇందూ పథము అని చెప్పెడివారు. మేము ఇందువులము, మాది ఇందూపథము అని తల ఎత్తి చెప్పుకొను రోజులు పూర్వముండెడివి. కాలక్రమమున మాయా ప్రభావము ఎక్కువై పోయి, మనుషులందరు గ్రుడ్డివారై పోయి పథమును మతముగా, ఇందువును హిందువుగా మార్చుకొన్నారు.

ఒకానొకరోజు ప్రపంచ వ్యాప్తముగానున్న ఇందువులకు కేంద్ర బిందువుగా భారతదేశముండెడిది. దైవజ్ఞానము మొదట భారతదేశములోనే పుట్టింది. అది పెరిగి విశ్వవ్యాప్తమైనది. కానీ నేడు అది తరిగిపోయి చివరకు భారతదేశములో కూడా 'ఇందువు' అను పేరు కనిపించకుండా పోయినది. భారతదేశములో మిగిలిన కొద్దిమంది తమ చరిత్రను మరచి పోయి, మేము హిందువులము అని అర్థమేలేని పేరును చెప్పుకొంటున్నారు. దైవజ్ఞానమునకు సంబంధించిన ఇందువు అను పేరును వదలిపెట్టి, భౌగోళిక సంబంధమైన ఒక ప్రాంతము పేరును, ఒక నది పేరును చెప్పుకొంటూ మేము హిందువులము అంటున్నారు. "అలా చెప్పుకోవడము తప్పు. మనలను మనము తగ్గించుకొని చెప్పుకొంటున్నాము. మనది ఉన్నతమైన పేరు, ఉన్నతమైన పథము" అని మేము చెప్పినా వినే స్థితిలో లేని చెవిటివారై పోయారు. మన చరిత్ర ఇది, మనము ఇందువులము, మనది ఇందూ పథము అని మేము ఒక గ్రంథమును వ్రాసి ఉచితముగా పంచితే, మహానందిలో మేము పరమతమును గురించి ప్రచారము చేస్తున్నామని మా మీద కేసులు పెట్టి కోర్టుకు త్రిప్పుచున్నారంటే, మనది పూర్వపు ఇందూ జాతేనా అని అనుమానము రాక తప్పదు. ఇవి మన సాంప్రదాయములు అని **"ఇందూ సాంప్రదాయములు"** అను పేరుతో ఒక గ్రంథమును వ్రాసి విడుదల చేస్తే, ఇందూ అని పేరు పెట్టడము తప్పు అని విశ్వహిందూ పరిషత్‌వారు గుంతకల్లులో మామీద భౌతిక దాడులకు పూనుకోవడము పర మతముల ముందర సిగ్గుచేటు కాదా! అడిగితే వివరముగా మీకు అర్థమయ్యేటట్లు చెప్పుతామనినా వినకుండా, మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** ను చూపించినా, ఆ భగవద్గీతను నడి బజారులో హిందూ సమాజమువారే నిప్పుపెట్టి కాల్చారంటే, పూర్వమున్న ఇందువుల ఆత్మలు ఆ దృశ్యమును చూచి వారిని శపించకుండా వదలరనిపిస్తుంది.

నేడు ఏమాత్రము ఇందూ సంస్కృతిని తెలియని హిందూసంస్థలు అనేకము పుట్టుకొచ్చాయి. ఆ సంస్థలలో ఉన్నవారికి పూర్వము ఇందూ మతము విశ్వవ్యాప్తముగా వుండెడిదనిగానీ, ఈశ్వరుడు తన తలమీద చంద్రవంకను ధరించడము వలన, మనకు ఆ రోజు సంపూర్ణ జ్ఞానముండుట వలన, మనము ఇందువులుగా ఉండెడివారమని గాని తెలియదు. ఇందూ మతము (ఇందూపథము) యొక్క పుట్టు పూర్వోత్తరములు తెలియనివారు, కృష్ణుడు చెప్పిన భగవద్గీతకు విలువనివ్వనివారు, మేము హిందువులమని, మతాన్ని రక్షించేదానికి మేము సంఘములుగా ఏర్పడినామని చెప్పు కొంటున్నారు. హిందూమతము ఎందుకు క్షీణించుచున్నదో, దానికిగల కారణమేమిటో ఏమాత్రము అర్థము చేసుకోవడము లేదు. ఇతర మతములవారు వారి ప్రవక్తలు చెప్పిన మాటలను చెప్పి, వారి మతములను అభివృద్ధి చేసుకొంటూ పోతుంటే, దిన దినమునకు హిందూమతము క్షీణించి పోవుచున్నది. హిందూసంస్థలు తమ జ్ఞానమును తెలుసుకొని, జ్ఞానమును బోధించి క్షీణించి పోవుచున్న మతమును రక్షించుకోవాలి. కానీ అలా కాకుండా పర మతముల మీద దాడులను చేస్తు హిందూమతమును రక్షిస్తామనడము, రోగానికి మందు ఇవ్వకుండ విషము ఇచ్చినట్లవుతుంది. మేము చెప్పు బోధలు నేడు ఎంతో ప్రశంసింపబడుచున్నవి. దీనిని మించిన జ్ఞానములేదు అని ప్రజలందరూ అనుచుండగా, మా జ్ఞానమును ఏమాత్రము చూడకుండ, చదువకుండా మమ్ములను అవమానపరిస్తే నేడున్న హిందూ సమాజము గ్రుడ్డిది అనక ఏమనాలి?

'మతము' అను పేరుతో అజ్ఞానము నిండిన మనుషులు గుంపులుగా చేరి, హిందువులే ఇందుత్వమునకు సమాధికట్టు సమయము వచ్చినది.

కావున భగవంతుని మూడవ అవతారమైన ఆకర్త రాక ఇంతలోనే ఉంటుందనుకొంటాము. ఇందూ ధర్మములకు పూర్తి ముప్పు ఏర్పడిన ఈ సమయములోనే, భగవంతుని రాక ఉంటుందని అనుకుంటున్నాము. నేడు హిందూసంఘములు జ్ఞానములేనివైన దానివలన, ఇప్పటికే ఉత్తరాంధ్ర సగానికి సగము హిందూమతమును వదలి పోయినది. కావున హిందువుల సంఘములకు ఇప్పటికైనా కనువిప్పు కలిగి, జ్ఞాన ప్రచారముతోనే హిందూ మతము రక్షించబడుతుందని, జ్ఞానములేకుండా సంఘములు పెట్టుకొని రాజకీయపార్టీలవలె మెలిగితే ప్రజలు ఛీకొట్టి పరాయి మతములోనికి పోవుదురని తెలియాలి. అందువలన ఇప్పటికైనా జ్ఞానులకు, గురువులకు విలువనిచ్చి వారి సలహాలతో జ్ఞానమును ప్రచారము చేసి, దానిద్వారా హిందుత్వమును కాపాడు ప్రయత్నము చేయమని చెప్పుచున్నాము. రాబోవు కాలములో ప్రజలు మతముల భ్రమలో మునిగిపోయి, దైవత్వమును మరచి పోవుదురను ఉద్దేశముతోనే మతముల విషయమును తన మరణములో కృష్ణుడు చెప్పి పోయాడు.

నేడు మతములను మార్చుకొను వారికి కనువిప్పు కలుగులాగున కృష్ణుడు తన మరణములో బోయవానికి రాబోవు క్రైస్తవమతమును గురించి చెప్పి దాని ప్రవక్తను నేనేనని చెప్పాడు. ఇప్పుడు మీకు అర్థమగుటకు మేము మతము అను పదమును వాడుచు చెప్పుచున్నాము. ఆనాడు కృష్ణుడు మతమను పేరును ఉపయోగించలేదని జ్ఞప్తికుంచుకోవలెను. ధర్మములను నెలకొల్పు కార్యములో మూడుమార్లు, మూడు కాలములలో చెప్పవలసిన బాధ్యత కృష్ణునికున్నది. అందువలన రెండవ అవతారముగా ఏసు పేరుతో వస్తానని చెప్పాడు. ఏసు పేరుతో వచ్చి అక్కడ కూడా ధర్మములను తెలియజేస్తానన్నాడు తప్ప ఒక మతమును స్థాపిస్తానని ఆయన

చెప్పలేదు. ఏసు చెప్పిన బోధ నలుగురు శిష్యులు వ్రాసిన నాలుగు సువార్తల రూపములో ఉన్నది. కానీ మొత్తము బైబిలు రూపములో లేదు. అందువలన ఈ గ్రంథములో ఎక్కడా బైబిలు అను పదమును వాడలేదని గ్రహించాలి. ఏసు చెప్పిన వాక్యములను ఎవడు గ్రహించునో వాడు నిజముగా ఏసు భక్తుడగును. ఏసు భక్తుడు అయినవాడు కృష్ణుడు ఏసు ఇద్దరూ ఒకరేనని గ్రహించును. అట్లు గ్రహించని వానికి ఏసు చెప్పిన జ్ఞానము అర్థము కాలేదని, వాడు ఏసు భక్తుడుకాదని అర్థమగును. నేడు ఎవరైనా నేను ఏసును విశ్వసిస్తున్నాను అనినా, వాడు నేను క్రైస్తవున్ని అని ఏసు క్రైస్తవ దేవుడని, హిందువుల దేవుడు వేరని అనుకోవడము వలన వాడు ఏసును విశ్వసించిన వాడు కాదని, కనుక నిజమైన క్రైస్తవుడు కాదని అర్థమగు చున్నది. దీనికంతటికీ మూలము కృష్ణుని మరణములో జరిగిన సమాచారము ఎవరికీ తెలియక పోవడము వలన, కృష్ణుడు ముందే చెప్పినట్లు ఏసుగా వచ్చినా, ఏసు నా దేవుడనుచు కృష్ణున్ని దూషించువారు కలరు. అలా ఏసు భక్తులు కృష్ణున్ని దూషిస్తే ఏసును దూషించినట్లే అగును. అదే విధముగ కృష్ణుని భక్తులు ఏసుని దూషించినా, ఏసే కృష్ణుడైన దానివలన వారు కృష్ణున్ని దూషించినట్లగును. కృష్ణుడు ఏసుగా పుట్టుతానని ముందే చెప్పినట్లు తెలియుట వలన, ఇటు హిందువులకు అటు క్రైస్తవులకు కనువిప్పు కలిగి, ఇప్పటి నుండి తమ ప్రవర్తనను మార్చుకొని, ఎవరు ఏ మతములో ఉండినా దేవుడే అందులో పుట్టించాడని తలచి, మతమును మారకుండా వుండి కృష్ణున్ని, ఏసును సమానముగా చూచు హిందువులు, ఏసును కృష్ణున్ని సమానముగా చూచు క్రైస్తవులు సమాజములో తయారు కాగలరని తలచుచున్నాను. ఏసు చెప్పిన నాలుగు సువార్తలను మాత్రము క్రైస్తవులు చదవాలి. నాలుగు సువార్తలతో సహా మొత్తము బైబిలును చదువువాడు

ఏసును గౌరవించనట్లే, ఆయన బోధలకు ప్రాధాన్యత ఇవ్వనట్లే. అటువంటి వాడు క్రైస్తవుడు కాడు. అదే విధముగా కృష్ణుడు చెప్పిన కేవలము 17 అధ్యాయముల భగవద్గీతను హిందువులు చదవాలి. గీతతో సహా వేదములను చదివినా లేక గీతను వదలి వేదములను చదివినా వాడు కృష్ణున్ని గౌరవించనట్లే. ఆయన బోధలకు ప్రాధాన్యత ఇవ్వనట్లే. అటువంటివాడు హిందువు (ఇందువు) కాడు. ఈ విధముగా లెక్కించి చూచితే ఈనాడు సరియైన హిందువు లేడు. అలాగే సరియైన క్రైస్తవుడు లేడు. అందువలన నేడు ఈ గ్రంథమును చదివి కృష్ణుని మరణ సమయములో జరిగిన రహస్యమును ఎవరైతే తెలుసుకొందురో వారందరికీ కనువిప్పు కల్గును. మనము నీది ఆ మతము, నాది ఈ మతమని చెప్పుకోవడము ఒకే వంశములో పుట్టిన ఇద్దరు అన్నదమ్ములు తమ వంశమును గురించి తెలియక అన్న ఒక వంశము పేరు, తమ్ముడు మరొక వంశము పేరు చెప్పితే స్వంత తండ్రినే మార్చినట్లుగును కదా! అందువలన ఇప్పటినుండైనా కొన్ని వేల సంవత్సరముల వెనుక ఏమి జరిగినదని యోచించి, తమ తమ మతములు పూర్వము లేనేలేవని గ్రహించి, అప్పుడున్నది ఒకే ఒక పథము మాత్రమేనని, అదియే **"ఇందూ పథమని"** తెలిసి, ఇందూపథములోనే నేడున్న క్రైస్తవులు, హిందువులు పూర్వముండెడి వారిని, ఆ ఇందూపథమును మరచిపోయిన దానివలన హిందూమతము, క్రైస్తవమతమని వేరువేరుగా చీలిపోయాయని తెలుసుకొంటే, ఈనాటికీ రెండిటియందు ఒకే బోధ ఉన్నదనీ, రెండిటినీ తెలిపినవాడు ఒకే భగవంతుడని తెలియగలదు.

జరుగబోవు విషయమును తెలిసిన కృష్ణుడు తన మరణ సమయము వరకు రాబోవు తన జన్మలను గురించి తెలుపలేదు. చివరి మరణ సమయములో బోయవానిని అడ్డము పెట్టుకొని, భవిష్యత్తు అవతారములను

గురించి చెప్పాడు. బోయవాడు విన్న దానిని తిరిగి చెప్పు సమర్థుడు కాదని తెలిసి కృష్ణుడు వానికే చెప్పాడు. అట్లు చెప్పుట వలన వాని ఆత్మ ఆ విషయమును స్వీకరించి, తన మూడవ అవతార సమయము సమీపించి నపుడు ఆత్మే ఆ విషయమును బయటికి తెలుపునట్లు భగవంతుడు నిర్ణయించాడు. అప్పటికి పెరగవలసిన అజ్ఞానమంతా పెరిగి, మత ద్వేషములు ఎక్కువై మానవుడు ఆధ్యాత్మికమను దారిని వదలి, మాయ దారిన పోవునపుడు, మూడవ పురుషుడుగా వచ్చినవాడు తన జ్ఞానమును తెలియబరచి ధర్మములను పూర్తిగా నెలకొల్పును. ఇక్కడ ముఖ్యముగ గమనించ వలసిన విషయమేమనగా! నేను అన్నదానము చేస్తాను. నేను అన్నమును పెట్టడము వలన మా దగ్గరున్నవారంతా ఆకలి లేనివారగుదురు. ఎవరికీ ఆకలి లేకుండా చేస్తానన్నపుడు, నావద్దనున్న వారందరికి ఆహారము దొరకకుండ పోయి పూర్తి ఆకలికొనిన వారైనపుడు, నేను ఇచ్చిన ఆహారము వలన వారి ఆకలి పూర్తిగ తీరిపోతే, అప్పుడు నేను చెప్పినట్లు అందరి ఆకలి తీర్చినట్లగును. నేను అన్నమును వండి సిద్ధముగా పెట్టుకొనినా, ఆ సమయానికి ఆకలికొనిన వారు ఎవరూ లేకపోతే నేను ఎవరి ఆకలీ తీర్చనట్లే కదా! అందువలన ఎదుటివారు ఆకలితోనున్నపుడే నా కార్యము నెరవేరును. అదే విధముగానే దేవుడు నేను భగవంతునిగా వచ్చి అధర్మములను లేకుండ చేస్తానన్నాడు. ఆయన పని అధర్మములను రూపుమాపి ధర్మములను తెలియపరచడమైనపుడు, ఆయన వచ్చినపుడు ధర్మములను ఆహారము లేకుండాపోయి అధర్మములను ఆకలి వుండాలి. అపుడు ధర్మములను ఆహారముతో అధర్మములను ఆకలిని తీర్చినవాడగును. అప్పుడు ప్రక్కవారి దృష్టిలో ఎదుటివాని ఆకలి తీర్చినవాడగును. భగవంతుడు కృష్ణుని రూపములో ఉన్నపుడు చెప్పిన మాట నెరవేరుటకు, తన మూడవ

అవతార సమయమునకు భూమిమీద పూర్తి అజ్ఞానమును పెరుగునట్లు చేశాడు. ఇక దాన్ని రూపుమాపి ధర్మములను నెలకొల్పి తనమాటను నిలబెట్టుకొనును. ఈ విధముగా దేవుడు భూమిమీదకు భగవంతుడుగా వచ్చి, మూడు అవతారములను ధరించి తిరిగి దేవునిగా మారిపోవుచున్నాడు. ద్వాపర యుగములో దేవుడు కృష్ణునిగావచ్చి, ధర్మములను గీత రూపములో చెప్పి పోయి, తర్వాత మూడు వేల సంవత్సరములకు ఏసుగా వచ్చి అప్పుడు కూడ ధర్మములను తెలియజేసి, మూడవ అవతారముగ 'ఆకర్త' రూపములో వచ్చి తనకార్యమును అంతటితో పూర్తి చేయును. అలా పూర్తి చేసిన భగవంతుడు తిరిగి దేవునిగా మారిపోవును. అందువలన మొదట కృష్ణుడు దేవుడు, తర్వాత కృష్ణుడు భగవంతుడు ఆ తర్వాత కృష్ణుడు దేవుడగును. అందువలన కృష్ణుడు దేవుడు మరియు భగవంతుడని చెప్పవచ్చును.

ఇంతవరకు చదివిన సమాచారమును బట్టి కృష్ణుడు తర్వాత ఏసుగా వచ్చాడని అనేక సాక్ష్యముల వలన తెలియుచున్నది. ఈ విషయములన్నియూ క్రోడీకరించి చూచిన తర్వాత ఒకే దేవుడు ఇద్దరిగా వచ్చాడని తెలియుచున్నది. అయితే ఈ జ్ఞానమును లోకములోని మనుషులు జీర్ణింపచేసుకోలేరు. సులభముగా అర్థమగు విషయమున్నా మధ్యలో వచ్చిన మతములు మనుషులలో చిచ్చుపెట్టి ఒక మతమువారు మరొక మతము వారితో ద్వేషించుకొనుచున్నారు. అంతటితో ఆగక వారి ప్రవక్తలని చెప్పబడుచున్న ఇద్దరు భగవంతులను దూషించుచున్నారు. హిందువులు ఏసును దూషించితే, క్రైస్తవులు కృష్ణున్ని దూషించుచున్నారు. ఇద్దరు కలిసి ఒకే దేవున్ని దూషిస్తున్నామను విషయము వారికి తెలియకుండా పోయినది. కృష్ణుడు చెప్పినది భగవద్గీతగాయుండగా, ఏసు చెప్పినది బైబిలుగాయున్నది. ఈ రెండిటియందు ఒకే దేవుని జ్ఞాన విషయమున్నా రెండు గ్రంథములు

వేరువేరు దేవున్ని గురించి చెప్పినవని అజ్ఞానము చేత మనుషులు అనుకోవడము జరుగుచున్నది. మేము సంపూర్ణముగా జ్ఞానమును తెలియగలిగి మతము అను మాయలో చిక్కుకోలేదు. మనుషుల తలలోని గుణముల ప్రభావము వలన అనగా మాయ ప్రభావము వలన 'మతము' అనునది మనుషుల మధ్యలోకి వచ్చి మనుషులను అజ్ఞానమువైపు లాగుకొని పోవుచున్నది. మతము యొక్క మత్తులో పడినవాడు విచక్షణ కోల్పోయి తాను ఏమి చేయుచున్నానను స్పృహను కోల్పోవుచున్నాడు. అటువంటి స్పృహ లేని మనిషి దేవునివైపు పోవునట్లు భ్రమించుచూ తాను వినాశనము వైపు, అజ్ఞానమువైపు పోవుచున్నాడు. మతము అను ముసుగులో ఎన్నో క్రూర కార్యములను చేయుచున్నాడు. ఎందరి మరణమునకో కారణమగు చున్నాడు. దానివలన భయంకరమైన పాపమును మూటగట్టుకొని దానినే అనేక జన్మల వరకు అనుభవించుచున్నాడు.

నేడు మేము త్రిమతములను ఒక్క తాటిమీదికి తెచ్చి అందరికీ 'ఒకే దేవుడు, ఒకే జ్ఞానము' అని చెప్పుచున్నా మమ్ములను కూడా అనేక ఇబ్బందులకు గురిచేయుచున్నారు. ఏమాత్రము దైవజ్ఞానము తెలియనివారు మత పెద్దలుగా, మత సంస్కర్తలుగా, మతరక్షకులుగా చెప్పుకొనుచూ మేమే నిజమైన హిందువులమని కొందరు, మేమే నిజమైన క్రైస్థవులమని కొందరు, మేమే నిజమైన ముస్లీమ్‌లమని కొందరు చెప్పుకొనుచూ దేశభక్తియని కొందరు, సమాజ భక్తియని కొందరు చెప్పుకొనుచూ వారివారి మతములను పెంచు కొనుటకు ప్రయత్నించుచున్నారు. నేడు భక్తియని గానీ, జ్ఞానము అనిగానీ లేక దైవగ్రంథములోని జ్ఞానప్రచారమనిగానీ ఎక్కడయినాయుంటే అక్కడ దేవుడూ, దేవుని జ్ఞానము ఉండదుగానీ, వారివెనుక మత అభివృద్ధే ధ్యేయముగాయుండును. వారివారి మతముల అభివృద్ధికి అందరూ

ప్రయత్నించుచుండగా, మేము మాత్రము **త్రిమత ఏకైక గురువు**గా మూడు మతములకు సామరస్యమును బోధించుచున్నా, మూడు మతముల లోని జ్ఞానము ఒక్కటేయని మరియు దేవుడు ఒక్కడేయని చెప్పుచున్నా అందరూ పెడచెవిన పెట్టుచున్నారు.

మొత్తము భూమిమీద ఎక్కడయినా మతప్రచారము తప్ప దైవజ్ఞాన ప్రచారమే లేదని చెప్పవచ్చును. అందరిలో మతము, మతప్రచారము, మత అభివృద్ధి తప్ప జ్ఞానము అనుమాటయే లేకుండా పోయినది. పైకి మాత్రము అందరూ జ్ఞానము పేరునే చెప్పుచున్నా, చివరికి వారిలో మత ఉద్దేశ్యము తప్ప మిగతాది ఏదీ లేదని తెలియుచున్నది. మతాతీత జ్ఞానము ఎక్కడా కనిపించడము లేదు. దేవుడు ఆకాశము చేత చెప్పిన జ్ఞానమునే తెరచాటున నుండి చెప్పించినా, తన ప్రతినిధియైన భగవంతుని (ఆదరణకర్త) చేత చెప్పించినా, మనుషులు మాత్రము దేవుడు చెప్పిన జ్ఞానమును వినినట్లే నటించుచూ, చివరికి మతమువైపే మొగ్గు చూపుచున్నారు. దేవుని జ్ఞానమును కూడా మత ప్రచారమునకే వినియోగించుచున్నారు.

కృతయుగములోగానీ, త్రేతాయుగములోగానీ, ద్వాపర యుగములో గానీ మరియు కలియుగములో మూడువేల సంవత్సరముల వరకు మతముల ప్రసక్తి లేదు, మనుధర్మ ప్రసక్తే ఎక్కువగా యుండెడిది. అప్పుడు అధర్మములు అంటే నాలుగే ముఖ్యముగా ఉండేవి. ఆ నాలుగు అధర్మములను అణచి వేయుటకు దేవుడు ముఖ్యముగా మూడు ధర్మములను ప్రచారమగునట్లు బోధించాడు. మూడు ధర్మములను మూడు యోగములుగా చెప్పడమైనది. దేవుని పుట్టుకయిన భగవంతుని బోధలన్నియూ మను ధర్మములనిపించు కొన్న నాలుగు అధర్మములను, వాటికి అనుబంధమైన ఆచరణలను అణచి

వేయడానికే మూడు యోగముల ధర్మములను తెలుపునవైయున్నవి. దేవుడు ఒక పథకము ప్రకారము చెప్పిన జ్ఞానములో మను ధర్మములని ప్రచారమయిన అధర్మములను లేకుండా చేయు ఉద్దేశ్యము తప్ప మరి ఏమీ లేదు. అధర్మములను లేకుండా చేయుటకు ధర్మములను బోధించవలసి వచ్చినది. దేవుడు తన బోధలో **అధర్మ ఖండన, ధర్మ ఉద్ధరణను** ముఖ్యముగా పెట్టి చెప్పడమైనది. దేవుడు మూడు విధములుగా భూమిమీద తన జ్ఞానమును చెప్పినా నాలుగు అధర్మములను లేకుండా చేయుటకే చెప్పాడుగానీ ఆనాడు లేని మతములను ఖండించి చెప్పలేదు.

నాలుగు యుగములలో మూడు యుగములనుండి మను ధర్మములే దేవుని జ్ఞానమునకు, దేవుని ధర్మములకు ఆటంకముగా యుండగా, నేడు కలియుగములో నాలుగు అధర్మములకంటే పెద్ద ఆటంకమైనది 'మతము' అనునది. మూడు యుగములలో మనుధర్మములు దేవుని జ్ఞానము ఎడల అధర్మములుగా యున్నా, అవి మనుషులందరిలో లేకుండా కొందరిలో మాత్రమే ఉండెడివి. మిగతా మనుషులకు అధర్మముల విషయముగానీ, ధర్మముల విషయముగానీ తెలియకుండా ఉండెడిది. మను ధర్మములు నాలుగు అధర్మములుగా యున్నా అవి పూర్వమునుండియున్న ఇందూ (హిందూ) సమాజములో ఒకటి లేక రెండు కులములలో మాత్రము ఉండెడివి. ముఖ్యముగా అగ్రకులములో మాత్రము నాలుగు అధర్మములైన యజ్ఞ, దాన, వేద, తపస్సులు అనునవి ఉండేవి. ఇందూ సమాజము తప్ప ఆనాడు ఏ మత సమాజము లేదు. ఆనాడు మూడు యుగములనుండి కుల వ్యవస్థలు, వాటి అజ్ఞానము ఉండెడిది. అయినా దేవుని జ్ఞానమునకు ఆటంకముగా ఏ కుల వ్యవస్థ లేకుండెడిది. ఒకే కులమువారు మాత్రము నాలుగు అధర్మములను ఆచరించుచూ, అందరిచేత ఆచరింపజేయుచూ

వాటి వలననే తమ జీవితమును సాగించుచుండిరి. ఒక అగ్రకులము వారే రాజులకు సహితము గురువులుగా యుండి, రాజుల చేత మరియు మిగతా మనుషుల చేత యజ్ఞ, దాన, వేదాధ్యయణ, తపస్సులను ఆచరింప చేయుచుండిరి. ఈ నాలుగు నేడుగానీ, ఆనాడుగానీ అందరికీ ముఖ్య కార్యములుగా కనిపించుచున్నవి. నేడు మేము ఈ నాలుగు ఆచరణలను అధర్మములనినా సహింపని బాధ కొందరిలో కలుగవచ్చును. అధర్మముల పేరును మేము చెప్పినా అవి వారిలో ధర్మములుగా నిండియుండుట వలన మా మాట రుచింపక వారిలో ద్వేషమును పెంచుచున్నవి.

ఇందూ సమాజము నేడు హిందూమతముగా మారిపోయి ఇతర మతములముందర బలహీనమైపోవుచుండుట, ఇతర మతములు అభివృద్ధి చెందుట అందరికీ తెలిసిన విషయమే. నేడు హిందువులలో మతరక్షణ ముఖ్యమైయుండగా దానికొరకు కొన్ని మత సంఘములు ఏర్పడినవి. మిగతా మతములలో మత అభివృద్ధి ముఖ్యధ్యేయమై అదే కార్యమును చేయుచున్నవి. ఇట్లు మత రక్షణలో కొందరు, మత అభివృద్ధిలో కొందరు కాలము గడుపు చున్నారు తప్ప పూర్వమునుండి దేవుడు ఏమి బోధించాడనిగానీ, నేడు మన మత గ్రంథములుగా చెప్పబడుచున్న మూడు దైవగ్రంథములలో ఏమున్నదని కళ్ళుతెరచి చూడకున్నారు. దేవుడు మనిషిగావచ్చి చెప్పిన బోధలు అజ్ఞాన గ్రుడ్డితనములో ఏమాత్రము తెలియకుండా పోయాయి. కొందరయితే 'దేవుడు పుట్టడు' అని కూడా వాదించుచున్నారు. మొత్తము మీద దేవుని జ్ఞానము భూమిమీద కరువైపోయినది.

పూర్వము అధర్మములని చెప్పబడునవి ఒక్క హిందూమతమునకు మాత్రము పరిమితమైపోగా, మిగతా మతములకు అధర్మములులేవు

కదా!యని కొందరడుగవచ్చును. దానికి జవాబును చెప్పితే ఇలాగున్నది. యజ్ఞ, దాన, వేద, తపస్సులు ఒక్క హిందూమతమునకే పరిమితమై పోయినా, మిగతా మతములలో ఈ నాలుగు మాటలే వినిపించకయున్నా వారిలో అన్నిటికంటే పెద్ద అధర్మమయిన 'మతము' వచ్చి చేరినది. పూర్వము నుండి యున్న నాలుగు అధర్మముల మీద రావణబ్రహ్మ మొదలగు వారు పోరాడి వాటిని లేకుండా చేయవలెనని తలచి లోకములో హీరో అయిన రావణబ్రహ్మ విలన్‌గా మారిపోయినాడు. హిందూమతములోని వారికి ఏది ధర్మము, ఏది అధర్మము అని తెలియకుండా పోయినది. ధర్మములను అధర్మములుగా, అధర్మములను ధర్మములుగా భావించుకొన్నారు. ఇదంతా నేటి హిందువుల అగచాట్లుకాగా, ఇతర మతములలోనికి 'తపస్సు' అను అధర్మము రూపము మార్చుకొని, పేరు మార్చుకొని చేరిపోయినది. వారిచేత వారికి తెలియకుండా తపింపజేయుచున్నది. ఆ విషయమును ఇతర మతముల వారు గ్రహింపలేకున్నారు. హిందువులకున్న నాలుగు అధర్మములలో దానము, తపస్సు అన్ని మతములలో చేరిపోయి వారిని కూడా అధర్మ మార్గములో ప్రయాణించునట్లు చేయుచున్నవి. ఇది ఇట్లుండగా నేడు అన్నిటికంటే పెద్దగాయున్న అధర్మము మతమనునది. మతము అనునది మూడు యుగములలో లేకున్నా నేడు కలియుగములో వచ్చి చేరినది.

ద్వాపర యుగము చివరిలో, కలియుగము మొదటిలో దేవుడు భగవంతునిగా వచ్చి కృష్ణుని రూపములో మూడు యుగములనుండి యున్న నాలుగు అధర్మములకు స్వస్తి పలుకుటకు ఎంతో నైపుణ్యముగా భగవత్ గీతను బోధించాడు. కృష్ణుడు చెప్పిన భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమున 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ త్రేతాయుగములో

రావణబ్రహ్మ ఎదిరించిన నాలుగు అధర్మములను అణచివేయుటకు ఈ రెండు శ్లోకములలో నాలుగు అధర్మములకు ఉచ్చు బిగించాడు. ఆ రెండు శ్లోకములను ఇక్కడ చూస్తాము.

**48వ శ్లో॥**

నవేద యజ్ఞాధ్యయ నైర్న దానైర్న చక్రియాభిర్న తపోభిరు గ్రైః
ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

**భావము :- "భూమిమీద నీవు తప్ప ఈ విశ్వరూపమును చూచినవారు లేరు. యజ్ఞముల వలనగానీ, వేదాధ్యయణము వలనగానీ, దానముల చేతగానీ, ఉగ్రతపస్సుల చేతగానీ నా దర్శనము దొరకుటకు శక్యము కాదు".**

**53వ శ్లో॥**

నాహం వేదైర్న తపసా నదానేన న చేజ్యయా ।
శక్యం ఏవం విదో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

**భావము :- "తపస్సు చేతగానీ, దానముల చేతగానీ, యజ్ఞముల వలనగానీ, వేదముల వలన గానీ ఇప్పుడు నీవు చూచిన ఈ విశ్వరూపము దొరుకుట శక్యము కాదు".**

ఈ విధముగా భగవద్గీత రెండు శ్లోకములలో అధర్మ ఖండన చేయడమే కాకుండా వీటివలన దేవున్ని తెలియుటకు శక్యము కాదని ఖండించి చెప్పడము జరిగినది. దేవుడు తన భగవద్గీతతో ఈ కార్యములు పనికి రావు, వీటి వలన నేను తెలియబడనని చెప్పినా మనుషులు మాత్రము అజ్ఞానముగానే అధర్మములనే ఆచరించుచున్నారు. యజ్ఞములు చేయుట,

వేదాధ్యయనము చేయుట, ధ్యానము (తపస్సు) చేయడమును అందరూ చేయుచున్నారు. హిందూ మతములో ఈ నాలుగు కార్యములకంటే మించిన జ్ఞానము లేదన్నట్లు మనుషులు ప్రవర్తించుచూ దేవుడు వద్దని చెప్పిన వాటినే చేయుచున్నారు. త్రేతాయుగములోనే రావణబ్రహ్మ ఈ నాలుగు కార్యములను పూర్తి వ్యతిరేఖించి, ఆనాడే వీటిని అధర్మములుగా ప్రకటించాడు. అయితే రావణబ్రహ్మను అందరూ యజ్ఞములను భంగము చేసినవాడు దుష్టుడని చెప్పారు. మనుషులకు మంచేదో చెడేదో తెలియక పోవడము వలన అధర్మములకు పూర్తిగా అలవాటు పడిపోయినందున రావణబ్రహ్మను ఆనాడు దుష్టుడని దూషించారు. అదే విషయమునే కృష్ణ భగవానుడు తన భగవద్గీతలో చెప్పితే దానిని తెలియనట్లు నిశ్శబ్దముగా యున్నారు.

ఆనాడు మూడు యుగములనుండి నాలుగు అధర్మములే రాజ్య మేలుట వలన మనుషులకు ధర్మములేవో తెలియకుండా పోయినవి. నాలుగు అధర్మములనే మనుషులందరూ ధర్మములనుకొని ఆచరించడము జరిగినది. చివరకు ద్వాపర యుగములో ధర్మములకు పూర్తిగా ముప్పు ఏర్పడి, అధర్మములు తారాస్థాయిలో చెలరేగిపోవడము వలన, దేవుడు అధర్మములను అణచివేసి ధర్మములను పునరుద్ధరించుటకు భూమిమీద మనిషివలె రావలసి వచ్చినది. భూమిమీద మనిషిగా పుట్టిన దేవుడు అధర్మములను తేల్చి ఇవియని భగవద్గీతలో చెప్పడమైనది. అయితే ఆనాడు మతములు లేనిదానివలన అప్పటికి అవియే అధర్మములుగా మనుషులను దేవునివైపు పోకుండా చేసెడివి. నేడు పూర్వమునుండి యున్న అధర్మములను మించిన 'మతము' అనునది వచ్చి అన్ని మతముల మనుషులను దేవుని మార్గమునుండి తప్పించి అజ్ఞాన మార్గములో పంపుచున్నది. నాలుగు

అధర్మముల ప్రభావము ఒక్క హిందూమతములోనే కనిపించగా, ‘మతము’ అను పెద్ద అధర్మము అన్ని మతములలో కనిపించుచున్నది.

దేవుడు చెప్పిన దైవజ్ఞానము మూడు గ్రంథములుగా రూపుదిద్దుకోగా, ఆ మూడు దైవగ్రంథములకు కూడా ‘మతము’ అను రంగుపూసి, ఇది హిందువులది, అది ముస్లీమ్‌లది, ఇంకొకటి క్రైస్థవులది అని చెప్పుచున్నారు. చివరకు దైవగ్రంథములు కూడా మతగ్రంథములుగా మారిపోయి అలాగే ప్రజలలో ప్రచారమైనాయి. ఇక మూడు గ్రంథములు మినహా వేరొక దైవగ్రంథము వచ్చుటకు వీలులేదు. దేవుడు చెప్పిన మూడు విధానముల ప్రకారము ముందు వెనుక మూడు గ్రంథములు వచ్చినవి. అవి వచ్చిన వరుస క్రమములోనే వాటికి ప్రథమ, మధ్యమ, అంతిమ దైవగ్రంథములని పిలువడమైనది. మూడు దైవగ్రంథములు ముందు వెనుక వచ్చినా వాటికి మతమను రంగుపూసి, వాటిని దైవగ్రంథముల స్థాయినుండి మతగ్రంథముల స్థాయికి మనుషులే దించివేశారు. కలియుగములో పుట్టిన ‘మతము’ అను అధర్మము పూర్వమునుండి యున్న నాలుగు అధర్మములకంటే పెద్దది.

పూర్వమునుండి యున్న అధర్మములు ఒక్క హిందూమతము మీద ప్రత్యక్షముగా ప్రభావము చూపినవి. కలియుగములో క్రొత్తగా వచ్చిన మతముల మీద **‘దానము’, ‘ధ్యానము’** అను రెండు పరోక్షముగా ప్రభావమును చూపినవి. యజ్ఞములు, వేదములు నేటికినీ హిందూ మతమును వదలక పీడించుచూ మనుషులను తప్పుదారి పట్టించుచుండగా కృష్ణుడు తన జ్ఞానములో వాటిని ఖండించాడు. తర్వాత వచ్చిన భగవంతుడు (ఆదరణ కర్త) ఏసు అప్పటి శాస్త్రులకు వ్యతిరేఖమైన బోధలను చెప్పగా

వారు ఏసు మరణమునకే కారణమయ్యారు. చరిత్ర అంతయూ గమనించగా కృష్ణుడు మరియు ఏసు ఇద్దరూ భగవంతులేనని తెలియుచున్నది. ఏసు భగవంతుడని ఏసు తర్వాత వచ్చు భగవంతుడు బోధించును. కృష్ణుడు భగవంతుడని కృష్ణుని తర్వాత వచ్చిన ఏసు చెప్పవలసియున్నది. అయితే ఏసు కృష్ణున్ని గురించి ఎక్కడా చెప్పినట్లు కనిపించలేదు. అయినా ఏసు కృష్ణున్ని పోలిన జీవితమును కొంత గడుపుట వలన ఏసు నేను కృష్ణుడు ఒక్కడేయని చెప్పినట్లయినది. ఏసు పుట్టినప్పుడు, కృష్ణుడు పుట్టినప్పుడు ఒకే విధమైన అనుభవములు ఇద్దరి జీవితములో వచ్చినవి. కృష్ణుడు అశుభ్రమైన జైలులో ప్రక్కలో తండ్రితప్ప ఎవరూ లేనప్పుడు పుట్టగా, అదే విధముగా ఏసు పశువుల పాకలో ప్రక్కలో తండ్రి తప్ప ఎవరూ లేని సమయములో పుట్టాడు. పుట్టిన వెంటనే ఇద్దరికీ ప్రాణాపాయముండుట వలన పుట్టిన స్థలమును ఇద్దరూ వదలిపోయారు. ఇద్దరిని చంపుటకు ఆయా దేశముల రాజులు ప్రయత్నించి చివరకు రెండు సంవత్సరముల చిన్నవయస్సు పిల్లలను చంపడము రెండుచోట్లా జరిగినది. కృష్ణుని జననములో జరిగిన సంఘటనలు మొత్తము ఏసు జీవితములో జరుగుట వలన కృష్ణుడు కూడా ఆదరణకర్తయేనను సూచనను ఏసు జీవితము చూపించినట్లయినది. ఏసు పుట్టుకయేకాక మరణము కూడా కృష్ణునివలె జరిగినది. ఏసు పాదములలో ములుకులు కొట్టగా రక్తము కారి చనిపోయాడు. అదే విధముగనే కృష్ణుని పాదమునకు బాణము తగిలి రక్తము కారి చనిపోయాడు. ఈ విధముగా ఏసు మరియు కృష్ణుని జనన, మరణములు రెండూ ఒకే రకముగాయుండుట వలన ఏసు, కృష్ణుడు ఇద్దరు ఒకే దేవుని అవతారమని తెలియుచున్నది.

ఆదరణకర్త వస్తాడు, వచ్చిన తర్వాత ఏసు దేవుడేయని, అతను భగవంతుడని తెలియజేయునని ఉన్నది. అయితే ఆదరణకర్త ఎప్పుడు వస్తాడు అని ఖచ్చితముగా చెప్పలేదు. ఆదరణకర్తగా వచ్చినవాడు ముందు వచ్చిన ఏసేనని, ఏసుగా వచ్చినవాడు ముందు వచ్చిన కృష్ణుడేయని మనము తెలియుటకు అనేక ఆధారములు దొరికినవి. ఇద్దరే కాదు రాబోయే వాడు కూడా **ముగ్గురు ఒక్కడే**నని తెలియుచున్నది. రాబోయే ఆదరణకర్త నన్ను గురించి చెప్పునని ఏసు చెప్పినట్లు కలదు. ఆయనే ఈయన అయినప్పుడు, ఆయనను గురించి ఈయన సులభముగా చెప్పగలడు. మొదట హిందూ సమాజములో దేవుడు మానవాకారములో వస్తే 'భగవంతుడు' అని అన్నారు. అదే 'భగవాన్' అనే పదమును ఇక్కడ బైబిలులో ఉపయోగించక ఆదరణకర్తయని చెప్పడమైనది. ప్రపంచములో అన్ని ఆదరణలకంటే జ్ఞానములో ఆదరించడమే గొప్ప. డబ్బు ఆదరణ దొరికినా, బంగారు ఆదరణ దొరికినా, ఏ విషయములో ఆదరణ దొరికినా అవన్నియూ అశాశ్వితమైన ఆదరణలేయగును. జ్ఞానములో ఆదరణ దొరికితే జీవితమే ధన్యమగును. అందువలన జ్ఞానములో ఆదరించువాడు ఒక్క దేవుడే ఉండును. జ్ఞాన ఆదరణ దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. దేవుడు అన్నిటికి కర్తయిన దానివలన మనిషి రూపములో వచ్చిన భగవంతున్ని ఆదరణకర్తయని చెప్పడమైనది. దేవుడు రెండు జన్మలలో ఆదరణకర్తగా వచ్చాడని కృష్ణుడు, ఏసు ఇద్దరూ ఒక్కడేయని మాకు తెలిసిన సత్యమును అనేకమార్లు చెప్పాము. దానిని అర్థము చేసుకోనివారు మాది మత ప్రచారమని క్రైస్తవ మతమును చెప్పుచున్నారని ఆరోపించారు. మేము మతముల సామరస్యమునకు ప్రయత్నించుచున్నాము. మతములకు అతీతమైన బోధలు చెప్పుచున్నాము. దానిని అర్థము చేసుకోలేని వారు

అజ్ఞాన ఆరోపణలు ఎన్ని చేసినా మేము లెక్కచేయము. జ్ఞానుల ఆరోపణలను మేము చూస్తాము. మా తప్పులేమయినా ఉన్నా సరిదిద్దు కుంటాము. అయితే అజ్ఞానుల ఆరోపణలను మేము పట్టించుకోము. అందువలన మేము చెప్పవలసినది చెప్పెదము. కృష్ణుడు ఏసు ఇద్దరు ఒక్కడేయని చెప్పాము. ఇప్పుడు మా వాదనను బలపరిచే విధముగా గాడేపల్లి కుక్కుటేశ్వర రావుగారు వ్రాసిన **"ఏసు కృష్ణీయం"** అను పద్య కావ్యమును క్రింద జతపరచుచున్నాము.

ఏసు కృష్ణుడు ఒక్కడేయంటే హిందువులు ఏసును ఎంతగా అసహ్యించుకొంటున్నారో, అంతకు రెండితలుగా కృష్ణున్ని క్రైస్తవులు అసహ్యించుకొంటున్నారు. అట్లని ఏసులోయున్న చెడు ఏమిటో హిందువులకు తెలుసాయంటే అదేమీ తెలియదు. అట్లే కృష్ణునిలోయున్న చెడేమిటో క్రైస్థవులకు తెలుసాయంటే అదేమీ వారికి కూడా తెలియదు. ఏమీ తెలియకుండా, వారిలో ఏమీ చెడు లేకున్నా ఎందుకు దేవుడయిన ఇద్దరినీ రెండు మతములవారు ఏవగించుకొంటున్నారో తెలియదు. అట్లు తెలియకపోవడము వలన స్వయముగా నేరుగా దేవున్ని దూషించినట్లగు చున్నది. ఆ దూషణ వలన భయంకరమైన పాపము మనిషికి అంటుకోగలదు. అటువంటి పాపము నా తోటి మనుషులకు రాకూడదను ప్రయత్నములో **ఇద్దరు ఒక్కడే**యను ఈ విషయములను ఇంత లోతుగా చెప్పవలసి వచ్చినది.

## యేసు పరముగా...

గీ. మరియ, లోలత నెలలు సమాప్తినమర
జంతుసాక్షిక నిర్బంధశాలలోన
దేవ కీలాభమూర్తియై దేవదేవుఁ
డవనిఁ బ్రభవించె దైవజ్ఞు లాత్మ నలర. 1

**అర్థము :** మరియ=మరియమ్మయను కన్య, లోలతన్= ఆందోళనతో, నెలలు సమాప్తిన్=గర్భవతియై నెలలు నిండుటచే, అమరన్=ఒప్పి యుండఁగా, జంతు సాక్షిక=పశువులు నిల్చి చూచు చున్న, నిర్బంధ శాలన్ =ఆ పశువులు బంధింపఁబడిన పాకయందు, దేవ= దైవసంబంధమైన, కీలా= అగ్ని తేజస్సుతో, ఆభ= సమానమైన, మూర్తియై=ఆకారము కలవాఁడై, దేవదేవుఁడు=దేవతలకే దేవుఁడని చెప్పఁబడిన క్రీస్తు, అవనిన్=భూమిపై, దైవజ్ఞులు=దివ్యనక్షత్రము ననుసరించి వచ్చిన ముువ్వురు తూర్పు దేశ జ్ఞానులు, ఆత్మన్=వారివారి మనస్సులయందు, అలరన్=సంతోషింపఁగా, ప్రభవించెన్=జన్మించెను.

**తాత్పర్యము :** మరియమ్మ ఆందోళన చెందుచుండఁగా నెలలు నిండినవి. అగ్ని తేజస్సుగల దేవదేవుఁడైన యేసు పశువులపాకలో ఆమె కడుపున జనించెను. ప్రభు జననమునకు తూర్పుదేశ జ్ఞానులు సంతోషించిరి.

## కృష్ణపరముగా...

గీ. మరి యలోలత నెలలు సమాప్తి నమర
జంతుసాక్షిక నిర్బంధశాలలోన
దేవకీ లాభమూర్తియై దేవుదేవుఁ
డవనిఁ బ్రభవించె దైవజ్ఞు లాత్మనలర. 1

**అర్థము :** నెలలు=తొమ్మిది మాసములు, మరి+అలోలతన్=ఏమాత్రము భంగపాటు లేకుండ, సమాప్తిన్=నిండుటచే, అమర=ఒప్పి యుండఁగా, జంతు సాక్షిక=వసుదేవుఁడు కాళ్ళుపట్టుకొనిన గాడిదనిల్చి చూచుచున్న, నిర్బంధశాలన్=చెఱసాలయందు, దేవకీ=దేవకీ దేవికి, లాభ-మూర్తియై=లభించినవాఁడై, దేవదేవుఁడు=విష్ణువు, అవనిన్=భూమిపై, దైవజ్ఞులు=దైవతత్త్వము నెఱిఁగిన అక్రూరుఁడు మొదలగు వారు, ఆత్మన్= వారివారి మనస్సులయందు, అలర=సంతోషింపఁగా, ప్రభవించెన్= జన్మించెను.

**తాత్పర్యము :-** గర్భ విషయమున నెట్టితొట్రుపాటు లేకుండ నెలలు నిండినవి. ఎట్టెదుట గాడిదనిల్చి చూచుచున్న చెఱసాలయందు, విష్ణువు దేవకీ దేవికి జన్మించెను. కృష్ణతత్త్వము నెఱిఁగిన అక్రూరాదులు సంతోషించిరి.

## యేసు పరముగా...

గీ. హె హె! హెరొదుఁడు, భూజాని, హేయబుద్ధి,
మాతులుఁడు, రేఁగి శిశుపరంపరను దునిమె,
దైవ మగుపట్టి మర్త్యుఁడౌ తద్విరోధి
కన్నులం గప్పి పితతోడఁ గదలి చనియె. 2

**అర్థము :** హె హె!=హి హీ! (పరిహాసవాచకము), హెరొదుఁడు=హెరోద్ అనునతఁడు, భూజాని=ఆ దేశపు రాజు, హేయ బుద్ధి=నీచ బుద్ధిగలవాఁడు, మా+అతలుఁడు=లక్ష్మిచే (సంపదచే) సాటిలేనివాఁడు, రేఁగి=విజృంభించి, శిశుపరంపరను=(రెండేండ్ల వయస్సునకు లోఁబడియున్న) బిడ్డల నెల్లరను, తునిమెన్=చంపించెను, దైవము+అగు=దేవుఁడైన, పట్టి=శిశువు (యేసు), మర్త్యుఁడౌ=మరణశీలుఁడై కేవలము=నరుఁడైన, తత్+విరోధి=ఆ శత్రువుయొక్క (హెరోద్ యొక్క), కన్నులన్+కప్పి=కన్నులకు మాయ కల్పించి, పితతోడన్=తండ్రితో (జోసెపుతో), కదలి–చనియెన్=వెడలి పోయెను.

**తాత్పర్యము :-** హెరోద్ రాజు నీచబుద్ధిగలవాఁడు, సాటిలేని సంపద గలవాఁడు. అప్పటికి రెండేండ్ల వయస్సునకు లోఁబడియున్న బిడ్డల నెల్లరను జంపించెను. **కానీ యేసు దైవము,** విరోధి మానవమాత్రుఁడు. కావున హెరోద్ రాజు కన్నులుగప్పి యేసు, తండ్రి వెంటఁ గదలి ఎటకో వెడలి పోయెను.

**కృష్ణపరముగా...**

**గీ. హెహెహె! రైదుఁడు, భూజాని, హేయబుద్ధి,**
**మాతులుఁడు రేఁగి శిశుపరంపరను దునిమె;**
**దైవమగు పట్టి మర్త్యుఁడౌ తద్విరోధి**
**కన్నులంగప్పి పితతోడఁ గదలి చనియె; 2**

**అర్థము :-** హెహెహె!=హిహిహీ! (పరిహాస వాచకము) రైదుఁడు= (ఆశ్రితులకు) ధనములనిచ్చు వాఁడు, భూజాని=రాజు, హేయబుద్ధి=నీచ బుద్ధికలవాఁడు, మాతులుఁడు=కృష్ణుని మేనమామ యైన కంసుఁడు, రేఁగి= విజృంభించి, శిశు-పరంపరను= దేవకీదేవి బిడ్డల నెల్లరను, తునిమెన్= ఖండించెను, దైవము+అగు =దేవుఁడైన, పట్టి=శిశువు (కృష్ణుడు), మర్త్యుఁడౌ= మరణశీలుఁడైన, తత్+విరోధి=ఆ శత్రువైన కంసునియొక్క, కన్నులన్+ కప్పి=కన్నులకు మాయ కల్పించి, పితతోడన్=తండ్రియైన వసుదేవునితో, కదలి-చనియెన్=వెడలి పోయెను.

**తాత్పర్యము :-** ఆశ్రితులకు ధనములనిచ్చు రాజును, మేన మామయు నైన కంసుఁడు నీచబుద్ధి కలవాఁడు, దేవకీదేవి బిడ్డలను వరుసగా ఖండించెను. కానీ దైవమైన శ్రీకృష్ణుఁడు మరణశీలియైన కంసుని కన్నులకు మాయ కల్పించి తండ్రియైన వసుదేవునితోఁ గదలి తప్పించుకొని పోయెను.

## యేసు పరముగా...

గీ. ఆతఁ డానంద జనకత నల్ల పెరిగి,
యేసు జనరక్షకఖ్యాతి నెసఁగి, గొల్ల
డై నిజాధీన పశువుల నరసికాచి
కొనుచు విహరించెఁ గొండలఁ గోనలందు. 3

**అర్థము :** అతఁడు= ఆ బిడ్డఁడు, ఆనంద జనకతన్= ఆనందమును చేకూర్చువాఁడగుచు, అల్లన్=క్రమముగా, పెరిగి=ఎదిగి, యేసు=యేసు అను పేరుచే, జనరక్షక–ఖ్యాతిన్=జనులకు రక్షకుఁడు అనుకీర్తి చేత, ఎసఁగి =ఒప్పి, గొల్లఁడై=గొల్లవారి వృత్తి నవలంబించి నట్టివాఁడై, నిజ+ఆధీన=తనవశమైయున్న, పసువులన్=గొఱ్ఱెలను, అరసి=జాగ్రత్తగాఁజూచి, కాచికొనుచున్= కాపాడు కొనుచు, కొండలన్= కొండలయందును, కోనలన్=కోనలయందును, విహరించెన్= సంచరించెను.

**తాత్పర్యము :–** ఆ బిడ్డఁడు ఎల్లరకు ఆనందము చేకూర్చుచు పెరిగెను. యేసు అను పేరుగల్గి జనరక్షకుఁడను కీర్తిని గడించి గొల్లవాని వలె గొఱ్ఱెలను కాచుకొనుచు కొండలలో కోనలలో విహరించెను.

**కృష్ణపరముగా...**

**గీ. ఆతఁడా నందజనకత నల్లపెరిగి**
**యే, సుజన రక్షకఖ్యాతి నెసఁంగి, గొల్లఁ**
**డై నిజాధీన పశువుల నరసికాచి**
**కొనుచు విహరించె కొండలఁ గోనలందు. 3**

**అర్థము :** అతఁడు=ఆ బిడ్డఁడు ఆ = ఆ విధముగా, నందజనకతన్ = నందుఁడే జనకుఁడుగాఁ గల్గియుండి (అనఁగా నందునకు కుమారుఁడై), అల్లన్=క్రమముగా, పెరిగియే=ఎదిగిన వాఁడగుచునే, సుజనరక్షక ఖ్యాతిన్ =సజ్జనులను రక్షింపఁగలఁడను కీర్తిచే, ఎసఁగి=ఒప్పి, గొల్లఁడై=గొల్లవాఁడై, నిజ+ఆధీన=తనవశము నందుండు, పశువులన్=ఆవులను, అరసి=జాగ్రత్తగాఁ జూచి, కాచి కొనుచున్=త్రోలికాపాడుకొనుచు, కొండలన్ = కొండల యందును, కోనలందు=కోనలందును, విహరించెన్= సంచరించెను.

**తాత్పర్యము :-** ఆ బిడ్డఁడు నందుఁడే తండ్రిగా పెరిగెను. సుజన రక్షకుఁడను కీర్తిని గడించి, ఆవులను కాచుకొనుచు కొండలలో కోనలలో విహరించెను.

## యేసు పరముగా...

గీ. ఆ పుడమిఱేఁడు దశ్శాసనాభిమాని
రాక్షసుఁడు, దేవసూతిపై రవులు కక్షఁ
బట్టి బంధించి శిక్షింపవలయు ననుచుఁ
బన్ను నతఁడింక నేమి కానున్నవాఁడొ! 4

**అర్థము :** ఆపుడమి ఱేఁడు= ఆ (యూదువంశపు) రాజు, దుశ్శా సన=చెడ్డ శాసనములు చేయుటయందు, అభిమాని= ఇచ్ఛగల వాఁడు, రాక్షసుఁడు=మహాక్రూరుఁడు, దేవసూతిపై=దేవుని కుమారుఁ డైన యేసు పై, రవులు-కక్షన్= రగులుచున్న ద్వేషముతో, పట్టి-బంధించి=పట్టుకొని నిర్బంధించి, శిక్షింపవలయున్+ అనుచు= దండింపవలెనని, పన్నున్= ప్రయత్నించుచున్నాఁడు, అతఁడు=ఆ యేసు, ఇంకన్=ఇఁకమీఁదట, ఏమి కానున్న వాఁడొ!=ఏమి కాఁబోవుచున్నాఁడో! (మృత్యువునకు గురి కానున్నడు గదా! అని ధ్వని.)

**తాత్పర్యము :-** ఆ యూదువంశపు రాజు మహాక్రూరుఁడు, భయంకర శాసనములు చేయు స్వభావము కలవాఁడు. దేవుని కుమారుఁడైన యేసుపై కక్షఁ బూనియున్నాఁడు. ఎట్లైనను పట్టి బంధించి శిక్షింపవలెనని ప్రయత్నించుచున్నాఁడు. పాపము! ఆ యేసు ఏమి కానున్నవాఁడోకదా!

## కృష్ణపరముగా...

గీ. **ఆ పుడమిఱేఁడు దుశ్శాసనాభిమాని**
**రాక్షసుఁడు, దేవసూతిపై రవులు కక్షఁ**
**బట్టి బంధించి శిక్షింప వలయు ననుచుఁ**
**బన్ను నతఁడింక నేమి కానున్నవాఁడొ! 4**

**అర్థము :** ఆ పుడమిఱేఁడు=రాజైన ఆ దుర్యోధనుఁడు, దుశ్శాసన = తమ్ముఁడైన దుశ్శాసనునకు, అభిమాని=గౌరవపాత్రుఁడు, రాక్షసుఁడు = రాక్షసాంశతో జన్మించిన వాఁడు, దేవసూతిపై=వసుదేవ కుమారుఁడైన కృష్ణునిపై (నామమునందు ఏక దేశగ్రహణము శాస్త్రసమ్మతము), రవులు కక్షన్=రగులుచున్న ద్వేషముచే, (కృష్ణుఁడు రాయబారమునకు వెళ్ళినపుడు) పట్టి బంధించి=పట్టుకొని త్రాళ్ళతోఁ గట్టి, శిక్షంపవలయును+అనుచున్ =దండింపవలెనని, పన్నున్= ప్రయత్నించుచున్నాఁడు, ఇంకన్=ఇఁక మీఁదట, అతఁడు=ఆ దుర్యోధనుఁడు, ఏమి కానున్నవాఁడొ!=ఏమి కాఁబోవు చున్నాఁడో కదా! (మృత్యువునకు గుటికానున్నాఁడని ధ్వని)

**తాత్పర్యము :-** దుర్యోధన నృపతి రాక్షసాంశతో జన్మించిన వాఁడు, దుశ్శాసనునకు గౌరవపాత్రుఁడు, వసుదేవ సుతుఁడైన కృష్ణునిపై కక్షను బూని పట్టుకొని త్రాళ్ళతో బంధించి శిక్షింపవలెనని ప్రయత్నించు చున్నాఁడు. ఆ దుర్యోధనుఁ డేమి కానున్నాఁడో కదా!

## యేసు పరముగా...

క. **శ్రీకలిత విశ్వరూప**
**ప్రాకట దర్శనము గ్రుడ్డివానికి నిడె సు**
**శ్లోకుండు, బాపురె! యహో**
**వా కన్నయ్యకు సముండు ప్రభుఁడు కలండే! 5**

**అర్థము :** సుశ్లోకుండు=మిక్కిలి కీర్తింపఁ దగినవాడు, శ్రీకలిత= శోభావంతమైన, విశ్వ=ఈ ప్రపంచము యొక్క, రూప=ఆకారమును, ప్రాకట-దర్శనము=చక్కఁగా, దర్శింపఁగల చూపును, గ్రుడ్డివానికిన్+ ఇడె = ఒకానొక అంధున కిచ్చెను, బాపురె!= ఔరా!, యాహోవా-కన్నయ్యకు =యహోవా కుమారుఁడైన యేసునకు, సముండు= సాటియైనవాఁడు, ప్రభుఁడు=దైవము, కలండే!=ఎక్కడనైననున్నాఁడా! (లేఁడనుట)

**తాత్పర్యము :-** మిక్కిలిగా కీర్తింపఁదగిన యేసు, ఒకానొక అంధునకు ప్రపంచమును దర్శించు నిమిత్తము చూపు నొసంగెను. ఆహా! యహోవా కుమారుఁడైన యేసునకు సాటివచ్చు దైవమే లేడు.

## కృష్ణపరముగా...

క. శ్రీకలిత విశ్వరూప
ప్రాకట దర్శనము గ్రుడ్డివానికి నిడె సు
**శ్లోకుండు, బాపురె! యహో !**
**వా! కన్నయ్యకు సముండు ప్రభుఁడు గలండే ! 5**

**అర్థము :** సుశ్లోకుండు=మిక్కిలి కీర్తింపఁదగినవాఁడు, శ్రీకలిత= శోభావంతమైన, విశ్వరూప=(తనయందలి) విశ్వరూపముయొక్క, ప్రాకట–దర్శనము=చక్కఁగా దర్శింపఁ గల చూపును, గ్రుడ్డివానికిన్+ ఇడె = ధృతరాష్ట్రునకు ప్రసాదించెను, బాపురె!=ఔరా!, అహో!=ఆహా!, వా!=వహ్వా! (ఈ మూడును ప్రశంసా వాచకములు), కన్నయ్యకు– సముఁడు=కృష్ణునకు సాటియైన వాఁడు, ప్రభుఁడు– కలండే! = దైవము కలఁడా! (లేదనుట.)

**తాత్పర్యము :–** కీర్తింపఁదగిన శ్రీకృష్ణుఁడు మహాశోభావంత మైన తన విశ్వరూపమును ధృతరాష్ట్రునకుఁ జూపెను. ఆహా! కృష్ణునకు సాటియైన దైవము మఱొకడు లేడు కదా!

## యేసు పరముగా...

గీ. సత్య భామా కరగ్రహ సరససత్త్వు
డగుచు, ధర్మజయమున నిత్యాభిమాన
మొదవ నాశీలి యరివర్గవిదళనమున
దండి మగఁడాయె, నరబోధకుండు నాయె. 6

**అర్థము :** ఆశీలి=శీలవంతుఁడైన ఆ పురుషుఁడు, సత్య=సత్యము అను, భామా=స్త్రీని, కరగ్రహ=చేపట్టుటచే, సరస=(దయా) రసముతోఁ గూడిన, సత్త్వుఁడు+అగుచున్=సత్త్వగున ప్రధానుఁడై, ధర్మ–జయమునన్ = ధర్మమే జయించి తీరవలెనను విషయమున, నిత్య+అభిమానము+ ఒదవన్=ఎడతెగని అభిమానము కలుగఁగా, అరివర్గ=కామక్రోధ లోభమోహ మదమాత్సర్యములు అను అరిషడ్వర్గమును, విధళనమునన్=(తనయందు) కొట్టివైచుటచే, దండి=ఉద్దండుఁడైన, మగడు+ఆమె=వీరుఁడైనాడు, (అట్లే) నర=తన తోడి వారైన జనులకు, బోధకుండు+ఆయె=బోధకుఁడు కూడనైనాఁడు.

**తాత్పర్యము :–** ఆ శీలవంతుఁడు సత్యము అను స్త్రీని చేపట్టి, దయారసము గలవాఁడై సత్త్వగుణ ప్రధానుఁడై, ధర్మమే జయింపఁ గలదను నిశ్చయముతో నుండెను. కామ క్రోధాది అరిషడ్వర్గమును జయించి తన తోడి జనులకు బోధకుఁడై విలసిల్లెను.

## కృష్ణపరముగా...

గీ. సత్యభామా కరగ్రహ సరస సత్త్వుఁ
డగుచు, ధర్మజ యమున నిత్యాభిమాన
మొదవ నా శీలి అరివర్గవిదళనమున
దండి మగఁడాయె, నరబోధకుండు నాయె. 6

**అర్థము :** ఆ శీలి=శీలవంతుఁడైన ఆ పురుషుడు, సత్యభామా= సత్యభామను, కరగ్రహ=వివాహమాడుటచే, సరస=(శృంగార) రసముతోఁ గూడిన, సత్త్వుఁడగుచు=దేవగుణమైన సత్త్వగుణముచే విశిష్టుఁడై, ధర్మజ= ధర్మరాజుయొక్కయు, యమున=యమునా నదీ దేవతయొక్కయు, నిత్య+అభిమానము=ఎడ తెగని పూజ్య భావము, ఒదవన్=తనయందు కల్గియుండఁగా, అరివర్గ=శత్రువులైన కౌరవాదులను, విదళనమునన్= సంహరించు విషయమునందు, నర=అర్జునునకు, బోధకుండున్=గీత బోధించినవాఁడును, దండి- మగడున్= గొప్పవీరుఁడను, ఆయె= అయినాఁడు.

**తాత్పర్యము :-** ఆ శీలవంతుఁడు సత్యభామను వివాహమాడి సరసుఁడై, సత్త్వగుణ విశిష్టుఁడై, ధర్మరాజు యొక్కయు యమునానదీ దేవత యొక్కయు అభిమానమును పొందెను. కౌరవాది శత్రుసంహార విషయమున అర్జునునకు భగవద్గీత బోధించెను.

## యేసు పరముగా...

గీ. పాపభారము బుజమున వైచికొనిన
దైవ మకట! కిరాత యూధపతి బారి
యినుపశూలము పాదభంజన మొనర్పఁ
బ్రాణములు వాసె, స్తంభరూపత వహించె. 7

**అర్థము :** పాపభారము=ఎల్లజనుల పాపము అను భారమును, భుజమున=తన భుజముపై, వైచికొనిన=వహించిన, దైవము=దేవుఁడైన యేసు, అకట!=అయ్యో!, కిరాత=కసాయి హృదయముగల, యూధపతి= యూదువంశపు రాజుయొక్క, బారి=వశముననున్న, ఇనుప–శూలము= శూలము వంటి యినుపమేకు, పాద–భంజనము+ ఒనర్పన్=రెండు పాదములను చీల్చుకొనుచు దిగఁగా, ప్రాణములు+ పాసెన్=ప్రాణములు విడిచెను, స్తంభ–రూపతన్=శిలువ యొక్క ఆకారమును, వహించెన్=యేసు ధరించిన వాఁడాయెను.

**తాత్పర్యము :–** సకల జనుల పాపభారమును మోసికొనివచ్చిన యేసు, క్రూరుఁడైన యూదుల రాజునకుఁజిక్కెను. ఇనుపమేకును రెండు పాదములనుండి దించి కొయ్యకునాటఁగా యేసు ప్రాణములు విడిచి శిలువ రూపమును ధరించిన వాఁడాయెను.

## కృష్ణపరముగా...

**గీ. పాప-భారము, బుజమున వైచికొనిన**
**దైవమకట! కిరాతయూధపతి బారి**
**యినుపశూలము పాదభంజన మొనర్పఁ**
**బ్రాణములు వాసె, స్తంభరూపత వహించె. 7**

**అర్థము :** భారము=భూభారమును, పాపన్=తొలఁగించుట, బుజమున వైచుకొనిన=తన బాధ్యతగా స్వీకరించిన, దైవము=కృష్ణుఁడు, అకట!=అయ్యో!, కిరాత–యూధ=బోయవారి సమూహమునకు, పతి= నాయకుఁడైన వానియొక్క, బారి=వశమునందున్న, ఇనుపశూలము= ఇనుముతోఁజేయబడిన ముసల శకలము, పాద–భంజనము+ ఒనర్పన్= పాదమును చీల్చుకొనిపోఁగా, ప్రాణములు+పాసెన్= ప్రాణములు విడిచెను; స్తంభ–రూపత=స్తంభము అను నిశ్చేష్టస్థితిని, వహించె=పొందిన వాఁడాయెను.

**తాత్పర్యము :-** భూభారమును బాపుట తన బాధ్యతగా స్వీకరించిన కృష్ణుఁడు, కిరాతుఁడు ప్రయోగించిన ఇనుప ములుకుగల బాణము పాదమును చీల్చివైనఁగా ప్రాణమును విడిచి నిశ్చేష్టస్థితిని బొందెను.

## యేసు పరముగా...

గీ. 'తనువు చాలించి యవతారమును ముగించి
నంత తీరెనె? నావారలార! నాకు
నేన పునరుత్థితుఁడ నౌదు నిక్క' మనియె
జేసు, దామాభినంద్యుఁడు, శ్రీకరుండు. 8

**అర్థము :** దామ+అభినంద్యుఁడు=పూలమాలలచే గౌరవింపఁదగిన వాఁడును, శ్రీకరుండు=శుభమును చేకూర్చు వాఁడును (ఐన), జేసు=యేసు, తనువు-చాలించి=శరీరమును త్యజించి, అవతారమును ముగించినంతన్= అవతారమును చాలించుటతోనే, తీరెనె!=అయినదా?, నావారలార!= ఓ నా శిష్యులారా!, నాకు-నేన=నాయంతట నేనే, పునః+ఉత్థితుఁడనౌదు= (మూఁడునాళ్ళకు) తిరిగి సమాధినుండి లేచి వచ్చెదను, నిక్కము+అనియె =ఇది నిజము అని చెప్పెను.

**తాత్పర్యము :-** పూలమాలలచే నభినందింపఁ దగిన వాఁడును శుభప్రదుఁడును నైన జేసు "శరీరమును విడుచుచున్నాను, ఐనను నా జీవయాత్ర ముగిసినట్లు కాదు, మూడునాళ్ళ తరువాత నాకు నేనే సమాధి నుండి లేచి వచ్చెదను" అని తన శిష్యులతోఁ జెప్పెను.

**విశేషము :-** శ్రీకరుఁడు-అనఁగా "శోభావంతమైన నల్లని మచ్చలు గల కరములు కలవాడు" అనియు చెప్పుకొననగును. సమాధినుండి లేచి వచ్చిన యేసు చేతులయందు, మేకులు దిగఁగొట్టిన నల్లని మచ్చలు శిష్యులకు కన్పించినవి. అందుచేత అతఁడు శ్రీకరుఁడు, "శ్రీకంఠుఁడు" అని శివునకు ప్రసిద్ధ నామము. అనఁగా 'శోభావంతమైన నల్లని మచ్చ కంఠమునందు కలవాఁడు' అని గదా వ్యుత్పత్త్యర్థము. అట్లే యేసు విషయము నందును.

**కృష్ణపరముగా...**

గీ. “తనువు చాలించి యవతారమును ముగించి
నంతతీరెనె! నావారలార! నాకు
నేన పునరుత్థితుఁడనౌదు నిక్క” మనియె
జే! సుదామాభినంద్యుఁడు, శ్రీకరుండు. 8

**అర్థము :** జే!=జయము జయము!, సుదామ+అభినంద్యుడు= భక్తుఁడైన సుదామునిచే అభినందింపఁదగినవాఁడును, శ్రీకరుండు= (కరగ్రహణ హేతువుగా) లక్ష్మీదేవి చేతియందుఁగలవాఁడునైన కృష్ణుఁడు, తనువు చాలించి=శరీరమును త్యజించి, అవతారమును=కృష్ణావతారమును, ముగించినంత=చాలించుటతోనే, తీరెనె!=అయినదా?, నావారలార!=నన్నే విశ్వసించియున్న భక్తులారా!, నాకు-నేన=నాయంతట నేనే, పునరుత్థితుఁడ నౌదు=తిరిగి తిరిగి యవతరించుచుందును, నిక్కము+అనియె = నిజమని చెప్పెను.

**తాత్పర్యము :-** జయము జయము! సుదామునిచే నభినందింపఁ దగిన కృష్ణుఁడు తనను విశ్వసించిన భక్తులతో ‘అవతారమును ముగించు టయే అంతము కాదు. తిరిగి తిరిగి నేను అవతిరించుచునే యుందును. ఇది నిజము’ అని చెప్పెను.

**విశేషము :-** ‘యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మా నాం సృజామ్యహం’ అన్నది భగవద్వాక్యము. (ఎపుడు ధర్మమునకు గ్లానియు, అధర్మమునకు విజృంభణమును కలుగునో అపుడు నాకు నేనే సృష్టించుకొని అవతరించుచుందును అని శ్లోకార్థము.)

‘నాకు నేను పునరుత్థితుఁడనౌదు’ అను మాటకు ఏతత్ గీతా శ్లోకమే ప్రమాణము.

## యేసు పరముగా...

క. పరలోక హారిమోక్ష
స్థిరపదపిత, దేవదేవ చిహ్నితుఁడౌ నీ
కరుణామయు చరితము నే
పురుషుఁడు వినుఁ జదువు నతఁడు పొందఁ డఘమ్ముల్ 9

**అర్థము :** పరలోక=పరలోకమునందలి, హారి=మనోజ్ఞమైన, మోక్ష=మోక్షమనెడు, స్థిరపద=నిశ్చలమైన స్థానమునకు, పిత=తండ్రి యైన వాఁడు (అనగా పరలోకమునందున్న తండ్రి), దేవదేవ=దేవునికే దేవుఁడని, చిహ్నితుఁడు+ఔ=పేరు తెచ్చుకొన్నవాఁడైన, ఈ కరుణా మయు=ఈ యేసు క్రీస్తుయొక్క, చరితమున్=కథను, ఏ పురుషుఁడు= ఎవఁడు, వినున్=వినునో, చదువున్= చదువునో, అతఁడు=అట్టివాఁడు, అఘమ్ముల్=పాపములను, పొందఁడు= కలిగియుండఁడు.

**తాత్పర్యము :–** మనోహరమైన మోక్షస్థానముగల పరలోకము నందున్న తండ్రియు, దేవునకే దేవుఁడైన వాఁడును కరుణామయుఁడు నైన ఈ యేసు చరిత్రము నెవఁడు వినునో యెవఁడు పఠించునో అట్టివాఁడు పాపరహితుఁడు కాఁగఁలడు.

## కృష్ణపరముగా...

క. పరలోకహారి, మోక్ష
స్థిరపదపిత, దేవదేవ చిహ్నితుఁడౌ నీ
కరుణామయు చరితము నే
పురుషుఁడు వినుఁ జదువు నతఁడు పొందఁ డఘమ్ముల్ 9

**అర్థము :** పర–లోక=శత్రుసమూహమును, హారి=సంహరించిన వాడును (అనఁగా శిశుపాల దంతవక్త్రాది శత్రువులను చంపిన వాఁడును), మోక్ష–స్థిర–పద=మోక్షము అను నిశ్చల స్థానమునకు, పిత=తండ్రివలె కారణమైనవాఁడును, దేవదేవ=దేవతలకే దేవుఁడని, చిహ్నితుఁడు+ఔ= పేరుగాంచినట్టివాఁడైన, ఈ కరుణామయు= దయాస్వరూపుఁడైన యీ కృష్ణుని యొక్క, చరితమున్=కథను, ఏ పురుషుఁడు=ఎవఁడు, వినున్=వినునో, చదువున్=చదువునో, అతఁడు=అట్టివాడు, అఘమ్మల్=పాపములు, పొందఁడు= కలిగి యుండఁడు.

**తాత్పర్యము :-** శత్రుసంహారకుఁడును, మోక్షస్థానమునకు కారణ భూతుఁడును, దేవదేవుఁడును, దయాస్వరూపుఁడునగు ఈ కృష్ణుని చరిత్రను ఎవఁడు వినునో ఎవఁడు పఠించునో అతఁడు పాపరహితుఁడు కాఁగలడు.

**ప్రశ్న :- చివరిగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. ఆదరణకర్త వస్తాడు అని ద్వితీయ దైవగ్రంథములో ఉండుట వలన ఆయన వచ్చుట సత్యమేయగును. అయితే మూడు దైవగ్రంథములలో అధర్మములను ఖండించి, దేవుడు ధర్మసంస్థాపన చేసినట్లు సంపూర్ణముగా జ్ఞానము చెప్పబడినది. ఇంత జ్ఞానము చెప్పిన తర్వాత కూడా దేవుడు తిరిగి మనిషిగా రావలసిన అవసరమేమున్నది?**

**జవాబు :-** ద్వితీయ దైవగ్రంథములో **ఆదరణకర్త** వస్తాడని చెప్పియుండుట నిజమే. అయినా ఆదరణకర్త అంటే ఎవరు? ఎట్లుంటాడు? అను విషయము మనుషులకు అర్థముకాక ఒక మతమువారు "ఆదరణకర్త మా ప్రవక్తయే" అని చెప్పుచున్నారు. అలా వచ్చియుంటే మాకు కూడా సంతోషమే. ఈ విషయములో వారు పొరపాటు పడియుండవచ్చును. ముహమ్మద్ ప్రవక్తగారే ఆదరణకర్తయని కొందరు ముస్లీమ్‌లు చెప్పుచున్నా ఖురాన్ గ్రంథములో జిబ్రయేల్ బోధించునప్పుడు "నీవు మనుషులను హెచ్చరించువాడవే"యని 13వ సూరా 7వ ఆయత్‌లో చెప్పారు. అంతేకాక సూరా 3, ఆయత్ 80లో **(3-80) "దూతలను, ప్రవక్తలను దేవునిగా చేసుకొమ్మని మీకు ఎప్పుడూ చెప్పలేదు"** అని ఉన్నది. ఆదరణకర్తయనగా భారతదేశ భాషలో భగవంతుడని అర్థము. దేవుడే ఆదరణకర్తగా వచ్చుట వలన ప్రవక్తగారికి ఆదరణకర్తకు సంబంధము లేదని చెప్పవచ్చును. అంతిమ దైవగ్రంథము వచ్చినది కావున ఇంకొక దైవగ్రంథము వచ్చుటకు కూడా వీలుపడదు. ఇంకా గొప్ప జ్ఞానమున్న గ్రంథము వచ్చినా వాటిని జ్ఞాన గ్రంథములుగా చెప్పవచ్చును గానీ దైవగ్రంథము అనుటకు వీలులేదు.

సృష్ట్యాదిలో జ్ఞానము చెప్పబడినా ఈ మధ్య ఐదువేల సంవత్సరముల నుండి మూడు దైవగ్రంథములు బయటికి వచ్చినవి. **మూడు దైవ గ్రంథములలో నాలుగు అధర్మముల అణచివేత, మూడు ధర్మముల ప్రతిష్ట గలదు.** ఈ విధానము గడచిన మూడు యుగములకు సరిపోగలదు. నేడు నడుస్తున్న కలియుగములో మూడు గ్రంథములలో చెప్పిన జ్ఞానముకంటే కొంత వేరుగాయున్న జ్ఞానము అవసరము. గడచిన మూడు యుగములలో ముఖ్యమైన **'మతము'** అను అధర్మము

లేదు. ఇప్పుడు ముందుయున్న నాలుగు అధర్మములకంటే మించినది 'మతము' అనబడు అధర్మము వచ్చినది. ఇంతకుముందు దేవుడు అవతరించినది మూడు యుగములనుండి మనుషులలో పాతుకొనియున్న అధర్మములను తీసివేయుటకు. అయితే ఇప్పుడు అప్పటి అధర్మములకంటే మించినది, బలమైనదియైన 'మతము' అను పెద్ద అధర్మము పుట్టుకొచ్చినది. దానిని లేకుండా చేయుటకు అప్పటి బోధలకంటే, అప్పటి జ్ఞానముకంటే మించిన జ్ఞానము అవసరమనిపిస్తున్నది. పూర్వము వేయిమంది జనాభాలో కేవలము పదిమంది లేక పదిహేనుమంది ఒక కులమునకు చెందిన వారుండెడివారు. వేయిమందిలో అన్ని కులములు ఉండగా ఒక అగ్రకులము వారు ఒకటి లేక రెండు లేక మూడు కుటుంబముల వారుండేవారు. అగ్రకులము వారికే చదువు వచ్చెడిది. వారికే ధర్మములుగానీ, అధర్మములుగానీ తెలిసెడివి. మిగతా మనుషులందరూ చదువు లేనివారై, ధర్మాధర్మములు తెలియనివారై సాధారణ జీవితమును గడిపెడివారు.

పూర్వము అధర్మములను ఆచరించువారు కొంతమందే యుండెడి వారు. వారికొరకే దైవగ్రంథములలోని జ్ఞానము చెప్పబడినది. అయితే పూర్వము వేయికి పదిలేక ఇరవైమంది మాత్రమే ధర్మాధర్మముల ఆచరణ కల్గియున్న వారుండగా, నేడు వేయిమందికి 999 మంది 'మతము' అనబడు అధర్మమును కల్గియున్నారు. మతము పూర్వపు నాలుగు అధర్మములకంటే ఎక్కువ సాంద్రతగా మనుషులలో అంటుకొని పోయి వున్నది. మతము అను జాఢ్యము ఏడు లేక ఎనిమిది సంవత్సరముల బాల్యము వద్దనుండి ప్రారంభమగుచున్నది. మతము అను రోగము జాఢ్యము రూపములో అంటుకొనియుండుట వలన, దానినుండి మనుషులను బయటికి లాగటానికి దేవుడు ముందు చెప్పిన బోధలకంటే మించిన జ్ఞానమును చెప్పవలసియున్నది. దీని విషయమై ద్వితీయ దైవ గ్రంథములో ఏసు ముందే ఒక మాట చెప్పియున్నాడు. ఏసు భూమిమీద ఉన్నప్పుడే మతాల, కులాల మాయను గురించి చూడగలిగాడు. అవియే ఆయన మరణమునకు కారణమైనాయని చెప్పవచ్చును. వాటి అసూయలు ఏసు మీద బాగా పని చేశాయి. అందువలన ఆయన ముందే తన మాటలలో చెప్పినది చూస్తాము.

***(యోహాను 16-12, 13) "నేను మీతో చెప్పవలసినవి ఇంకను అనేక సంగతులు గలవు. కానీ ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు. అయితే ఆయన అనగా సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మిమ్ములను సర్వసత్యములోనికి నడిపించును. ఆయన తనంతట తానే ఏమియు బోధించక వేటిని వినునో వాటిని బోధించి సంభవింపబోవు సంగతులను మీకు తెలియజేయును."***

ఈ వాక్యము అప్పటికేయున్న మతమను అధర్మమును గురించి చెప్పినదేయని అర్థమగుచున్నది. అప్పుడు మతమును గురించి అది పెద్దమాయ యని చెప్పినా, మనుషులు సహింపలేని విధముగా మత మాయలో కూరుకపోయి ఉండుట వలన ఆయన అలా చెప్పాడు. రాబోవు భగవంతుడు తప్పక మతము అను మాయను తొలగించుటకే వచ్చును, కనుక **"మిమ్ములను మతరహితమైన సత్యములోనికి నడిపించును"** అని సూచనప్రాయముగా చెప్పాడు. ఆయన స్వయముగా తనంతట తాను బోధించక అప్పటి కాలములోయున్న మత అరాచకములను, మత పోరాటములను, మతము వలన జరుగు యుద్ధ వినాశనములను చూచి, అప్పుడు ఏమి జరుగుచున్నదో దానిని విని, దానిని గురించే బోధించును. అనగా మతము యొక్క అధర్మమును గురించి చెప్పునని చెప్పడమైనది. ఈమారు వచ్చు దేవుడు మూడు దైవగ్రంథముల జ్ఞానమును మించిన జ్ఞానమును చెప్పవలసియుండును. అందువలన "రాబోవు ఆదరణకర్త నేను చెప్పని వాటిని కూడా చెప్పునని" ద్వితీయ దైవగ్రంథములో చెప్పడమైనది. ఇప్పుడు రాబోవు భగవంతుడు మత మాయను గురించి ముందు చెప్పిన బోధలకంటే ఎక్కువ బోధలు చెప్పవలసియున్నది. అందువలన దేవుని సేవలో భాగముగా మేము ముందే మతరహిత జ్ఞానమును బోధించుచున్నాము. **మతమును విడండి, పథమును అనుసరించండి.**

**సమాప్తము**

# ఒక్కడే ఇద్దరు

| తామసము | రాజసము | సాత్త్వికము | యోగము |
|---|---|---|---|
| ↓ | ↓ | ↓ | ↓ |
| మ | త | మ్ | మత రహితము |


*Author :*

**The Only GURU of Three Religions**

**The Spiritual Emperor, Thraitha Theorem Originator**

**Sri Acharya Prabodhananda Yogeeshwarulu**


**www.thraithashakam.org**